Photo by D. Kasbekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

పడగ విప్పవే పామా

పంపినవారు :
బి. సి. రెడ్డి - విశాఖపట్నం

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




టిన్నులు-అనేక ఆకృతులలో అందంగా ముద్రించి
బహుమతులుగా ఇవ్వటానికి అర్హమైనవి.



అందరకూ మంచివి
అందరకూ ప్రియమైనవి

**J. B. MANGHARAM & CO.,**
GWALIOR, INDIA

*makers of famous biscuits*

జె. బి. మంఘారామ్ అండ్ కో.,
గ్వాలియర్, ఇండియా
ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు

చూచేవారిని
ఆశ్చర్యపరిచే
సౌందర్యకాంతికి...




# రెమి స్నో & పౌడరు

AVRA-603


ధైర్యశాలి
రామూ
డంబాల
రంగా




నీవు భయపడితే వెళ్ళిపో, నేను ఆట చూస్తూ వుంటాను.
అవును, ఇది నీవంటి పిల్లలకే, నావంటి ధైర్యశాలురకుగాదు!


ఆ యాట చాల తమాషాగా వుండెను!
హుం! నేనే ఇలాంటి ఆటలు ఎన్నో ఆడించాను


అనేక మార్లు నేను అడవిలోకి వెళ్ళి నాగస్వరం ఊదాను...


...పాములు పరవశంతో నావద్దకు వచ్చేవి...


...నేను పాముల హారాలతో వీధుల్లో తిరిగే వాడను, అప్పుడు జనులు నాకు మొక్కేవారు!

DL. 478A-50 TL























DL 478B-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.

రాజకీయాల్లో ఆసక్తి కొందరికి...





కాని, ప్రతీవారికి ఆసక్తి



Parry's ప్యారీస్

మిఠాయీల్లోనే

ఎందుకంటే, అవి అంత రుచిగలవి, అంత పరిశుభ్రమైనవి, అంతే ఆరోగ్యమైనవి

తయారుచేయువారు : ప్యారీస్ కన్ ఫెక్షనరీ లిమిటెడ్, మదరాసు

PRS 276



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచీ "చందమామ" లో కొన్ని కొత్త ఆకర్షణలు ప్రవేశ పెడుతున్నాము.

ఇంతవరకూ అట్టమీదిబొమ్మ కథను ఒక పేజీలోమాత్రమే ఇస్తూవచ్చాము. ఇకనుంచీ భారతకథ సీరియల్‌గా పాఠకులకు అంద జేస్తున్నాము. ఇందువల్ల పాఠకులు భారత కథను మరింత విపులంగా చదివి అందులోని పాత్రలనూ, సన్నివేశాలనూ చక్కగా ఆనందించ గలుగుతారు.

"చందమామ వద్దకు ప్రయాణం" అన్నది వైజ్ఞానిక వ్యాసం. మరికొద్ది సంవత్సరాలలో ఈ ప్రయాణం జరిగే అవకాశం ఉన్నదిగనక ఈ వ్యాసం పాఠకులకు ఉపయుక్తంగా ఉంటుంది.

"ప్రకృతివింతలు" ఈ సంచికతో ముగిసింది. పై సంచికనుంచి మరొకరకం వింత అనుభవాలను సీరియల్‌గా ప్రారంభిస్తాము.

సంపుటి 24 : మార్చి 1959 : సంచిక 3



SANKA




శ్రీకృష్ణుడు రాయబారం విఫలమై పాండవుల వద్దకు తిరిగి వెళ్ళిపోయాక దుర్యోధనుడు మిగిలిన దుష్టత్రయాన్ని, కర్ణ శకుని దుశ్శాసనులను పిలిపించి వారితో సమాలోచన చేశాడు.

"సంధి చేయవచ్చిన కృష్ణుడు తన పని కొనసాగకుండానే తిరిగి వెళ్ళాడుగదా. అతను వెళ్ళి పాండవులను బాగా రెచ్చగొడతాడు. అర్జునుడూ భీముడూ అతను ఏం చెయ్యమంటే అది చేస్తారు. ధర్మరాజు వారిని కాదని ఏపనీ చెయ్యడు. పోతే పాండవుల పక్షాన ఉన్నవారిలో విరాటుడూ, ద్రుపదుడూ నాకు ఇంతకు పూర్వమే శత్రువులు. పాండవుల సేనకు గల నాయకులలో వాళ్ళు ప్రముఖులు. అందుచేత యుద్ధం తథ్యం. ఇక మనం తాత్సారం చేసేటందుకు ఎంతమాత్రమూ వీలులేదు. వెంటనే సమరసన్నాహాలు సాగించండి. కురుక్షేత్రంలో మనందరికోసమూ అనేక వందల గుడారాలు నిర్మించండి. వాటి నిర్మాణానికి తగిన స్థలం చూడండి. ఆ చోటు శత్రువులకు సులువుగా అందరాదు; జలకాష్ఠ సమృద్ధి కలదిగా ఉండాలి. శిబిరాలకు ఆహారపదార్థాలు చేరే మార్గాలను శత్రువులు ఛేదించకుండా రక్షణలు ఏర్పాటు చేయండి. అన్ని శిబిరాలలోనూ ఆయుధాలు పుష్కలంగా పేర్చండి. హస్తినాపురంనుంచి శిబిరాలకు చదునైన మార్గం వేయించండి. రేపే సేనలు కురుక్షేత్రానికి తరలి వెళ్ళాలని చాటించండి," అని దుర్యోధనుడు తన అనుచరులకు ఆదేశించాడు.

శకుని కర్ణ దుశ్శాసనులు వెంటనే యుద్ధ సన్నాహాలు ఆరంభించారు. కురుక్షేత్రంలో, దుర్యోధనుడి పక్షాన యుద్ధంచేసే రాజుల కోసం అనేక వేల సంఖ్యలో శిబిరాలు నిర్మించబడ్డాయి. ఇక్కడ హస్తినాపురం

కోలాహలంగా ఉన్నది. దుర్యోధనుడి ఆదేశం వినగానే రాజులందరూ జబ్బలు నిమురుకుని, తలపాగాలు చుట్టుకుని, యుద్ధాలంకారాలు చేయసాగారు. సారథులు రథాలనూ, కాసావాళ్లు గుర్రాలనూ, మావటి వాళ్లు ఏనుగులనూ ఆయత్తపరిచారు. పదాతిసైనికులు ధగధగ మెరిసే కవచాలు తొడుక్కుని, శస్త్రాలు ధరించి యుద్ధసన్నద్ధు లయారు. నగరమంతా ఏదో ఉత్సవం జరుగుతున్నట్టుగా కనపడింది. ఎక్కడ చూసినా జనమూ, గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ, శంఖనాదాలూ, దుందుభి మోతలూనూ!

ఆ రోజు పాండవ శిబిరంలో ధర్మరాజు రానున్న కులక్షయం గురించి చాలా బాధ పడినవాడై కృష్ణుడితో, "మహాత్మా, మాతల్లి కుంతీదేవి యుద్ధం చెయ్యమంటున్నది. కాని నీ ఉద్దేశం ఏమిటి?" అని అడిగాడు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, ఈ యుద్ధం మనం కోరి తెచ్చుకున్నది కాదు. దుర్యోధనుడికి చెప్పవలిసినదంతా నేను చెప్పాను, విదురుడూ చెప్పాడు. భీష్మ ద్రోణులు అతని బుద్ధి మార్చలేకపోయారు. శకుని కర్ణాదులు అతని దుర్బుద్ధిని రెచ్చ గొట్టారు. అందుకే వంశక్షయానికి దారి తీసే ఈ యుద్ధం వచ్చిపడుతున్నది. దానికి





మనం ఏమి చేయగలం. రాజ్యభాగం ఇవ్వకుండానే మనం సంధి చేసుకోముగదా! ఇక యుద్ధం చెయ్యక ఎలా తప్పుతుంది?" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడుకూడా అదే ధోరణిలో మాట్లాడి ధర్మరాజు మనస్సును యుద్ధానికి సుముఖంచేశాడు.

ఆ రాత్రి గడిచింది. మర్నాడు దుర్యోధనుడు తనవెంట ఉన్న పదకొండు అక్షౌహిణుల సేనలో గల చతురంగ బలాలను, ఉత్తమ, మధ్యమ, దుర్బల శాఖలుగా విభజించాడు. ఉత్తమ బలాలు యుద్ధరంగంలో ముందు నిలబడేటట్టూ, మధ్యమ బలాలు మధ్య నిలబడేటట్టూ, దుర్బల బలాలు వెనుక పార్శ్వంలో ఉండేటట్టూ నిర్ణయించాడు.

యుద్ధంలో ఒక రథం దెబ్బతిని దానిలో ఒక భాగం విరిగిపోయినట్టయితే దాన్ని మరమ్మతు చెయ్యటంకోసం అవసరమైన సామగ్రి రథాల అడుగుభాగాన అమర్చారు. రథాల తూణీరాలలో అంబులూ, నూరేసి విల్లులూ ఇతర ఆయుధాలూ, తాళ్లూ, పాశాలూ, జెండాలూ మొదలైనవన్నీ అమర్చారు.

రథ సారధులైనవారికి కవచాలుంటాయి. వారు శూరులూ, శస్త్రాలన్నిటినీ తెలిసిన







వారూ, అశ్వలక్షణాలు ఎరిగినవారూ అయి ఉండాలి. అలాటివారిని రథ సారథులుగా నియమించారు. ఒక్కొక్క రథానికీ నాలుగేసి ఉత్తమాశ్వాలను పూన్చారు. ఒక్కొక్క రథం వెంటా ఏడుగురేసి యోధులుంటారు. ఒకడు రథం వెనక సామాను మోసే గుర్రంపైన ఉంటాడు; ఇద్దరు రథసారథులుంటారు, ఇద్దరు యుద్ధం చేసేవారుంటారు, వీరు గాక ఒక రథీ, ఒక అశ్వనిపుణుడూ కూడా ఉంటారు.

ఏనుగులనుకూడా అలంకరించి ఆయత్తం చేశారు. రథం వెంట మాదిరిగానే, ఏనుగు వెంట కూడా ఏడుగురేసి ఉంటారు. వారిలో ఇద్దరు అంకుశాలు పట్టుకునే మావటీలు, ఇద్దరు బాణాలతో యుద్ధం చేసేవారు, ఇద్దరు ఖడ్గధారులు, శక్తులనూ, త్రిశూలాలనూ ధరించిన వాడు ఒకడు. వీరంతా ఏనుగుపైనే ఉంటారు. ఒక్కొక్క అశ్వదళం వెంటా వెయ్యేసి మంది మహాబలవంతులైన యోధులుంటారు.

సైన్యం ఎలా సంఘటితపరచబడిందంటే ఒక్కొక్క రథానికి పదిమంది గజయోధులు, ఒక్కొక్క ఏనుగువెంటా పదేసి గుర్రాలూ, ఒక్కొక్క గుర్రంవెంటా పదేసిమంది కాల్భటులూ ఉన్నారు.

దుర్యోధనుడు తన పదకొండు అక్షౌహిణుల సేనను ఈవిధంగా విభజించి, పదకొండుగురు సేనాపతులను నియమించాడు. వారెవరంటే: కృపుడు, ద్రోణుడు, శల్యుడు, సైంధవుడు, సుదక్షిణుడు, కృతవర్మ, అశ్వత్థామ, భూరిశ్రవసుడు, కర్ణుడు, శకుని, బాహ్లికుడు.

అనంతరం దుర్యోధనుడు రాజులందరి సమక్షాన భీష్ముడికేసి తిరిగి నమస్కరించి, "మహాత్మా, మహాసముద్రంలాటి సేన అయినప్పటికీ తగిన నాయకుడు లేకపోతే చీమలపుట్టలాగా చెదిరిపోతుంది. చిల్లర సేనాపతులమధ్య ఏకాభిప్రాయం కుదరక

పోవచ్చు, అంతఃకలహాలుకూడా ఏర్పడ వచ్చు. అందుచేత సమర్థుడైన సర్వసేనాని ఉండటం అవసరం. యుద్ధంలో విజయాని కది మొదటి మెట్టు. నీవు గొప్ప నీతిమం తుడవు, మా హితం కోరినవాడివి, ధర్మం తప్పనివాడవు, అజేయుడవు. కావున ఈ సేనలన్నిటికీ సర్వసేనాధిపత్యం వహించ మని నిన్ను వేడుకుంటున్నాను. నీవు వృషభ రాజులాగా ముందు నడిస్తే మేము గోవుల మందలాగా నిన్ను అనుసరించి వస్తాము!" అన్నాడు వినయంగా.

దానికి భీష్ముడు ఇలా చెప్పాడు: "నాయనా, నువ్వన్నమాటలలో కొంత నిజం లేకపోలేదు. పాండవసేనలో నాతో సమంగా పోరగలవాడు అర్జునుడు తప్ప మరొకడు లేడు. వాడివద్ద అనేక దివ్యాస్త్రాలున్నాయి. వాడు నాతో ఇంతవరకెన్నడూ ముఖాముఖి యుద్ధం చేయలేదు. మేమిద్దరమూ ఒకరి నొకరు ఎదిరించి మా కుగల దివ్యాస్త్రా లన్నీ ప్రయోగించినట్లయితే భూమి నిర్మా నుష్యమైపోగలదు. అయితే నాకు మీరెంతో పాండవులూ అంతే. నేను వారిని యుద్ధంలో చంపటమనేది జరిగే పనికాదు. మిగిలిన యోధులనంటావా, లక్షల సంఖ్యలో చంపే స్తాను. ఇంకొక్క విషయంకూడా ఉన్నది. కర్ణుడూ, నేనూ కలిసి యుద్ధం చెయ్యటం





నా కిష్టంలేదు. ఎందుకంటే అతనికి నేనంటే మాత్సర్యం. అతని అనంతరం నేను యుద్ధం చేస్తాను, లేదా నా అనంతరం అతను యుద్ధం చేయవచ్చు. ఈ రెండు నియమాలూ నీకు సమ్మతమైతే నీసేనలకు సర్వసేనాధిపత్యం వహించగలను."

ఈ మాటలు విని కర్ణుడు, "ముందు మీరే యుద్ధం చెయ్యండి. మీ అనంతరమే నేను యుద్ధంలోకి వస్తాను," అన్నాడు.

తరవాత దుర్యోధనుడు బ్రాహ్మణులకు భారీగా దక్షిణలిచ్చి భీష్ముడికి సర్వసైన్యాధిపత్యాభిషేకం చేశాడు. భేరీలూ, మృదంగాలూ, తప్పెటలూ మొదలైన వాద్యాలు మోగించారు, సింహనాదాలు చేశారు, శంఖాలు పూరించారు, ఏనుగులు ఒక్కపెట్టున ఘీంకరించాయి.

ఇదే సమయంలో కొన్ని దుశ్శకునాలు కూడా కలిగాయి. ఆకాశం నుంచి అశరీరవాక్యాలు వినిపించాయి. మబ్బులు లేకుండానే నెత్తురువాన కురిసింది. పెనుగాలులు వీచాయి. వీటిని చూసి యోధులందరూ భయపడ్డారు.

తరవాత దుర్యోధనుడు తన తమ్ములనూ, భీష్ముణ్ణీ, తదితర రాజులనూ వెంటబెట్టుకుని కురుక్షేత్రానికి బయలుదేరాడు. కురుక్షేత్రంలోని వారి శిబిరాలు చూస్తే హస్తినాపురం మళ్ళీ కురుక్షేత్రంలో వెలిసిందా అన్నట్టుగా ఉన్నది.

కౌరవ పాండవుల మధ్య యుద్ధం జరగనున్నట్టు తెలిసి బలరాముడు అక్రూర సాంబ గదాదులను వెంటబెట్టుకుని పాండవుల వద్దకు వచ్చి, ధర్మరాజుతో, "మాకు మీరూ కౌరవులూ సమానులే. మీకూ వారికీ కూడా సమంగా సహాయం చెయ్యమని కృష్ణుడితో చెప్పాను. కాని వాడు మీఎడల పక్షపాతం వహించాడు. నేను కౌరవుల నాశనం చూడలేను; తీర్థయాత్రలు చేయబోతున్నాను!" అని చెప్పి వెళ్ళిపోయాడు.






## 9

[ చంద్రవర్మ, కాపాలిని దగ్గిర సెలవుతీసుకుని ఉత్తరదిక్కుగా బయలుదేరాడు. అడవి దాటేందుకు దారి చూపుతూ కాలసర్పం ముందు నడవసాగింది. ఒక వాగు పక్కన వింతవృక్షం ఒకటి చంద్రవర్మకు కనిపించింది. దానికి వేలాడుతున్న ఒక పండును కోసుకు తినగా అతడికి పశుపక్ష్యాదుల భాషలు తెలిసిపోయినై. మరికొంత ముందుకు వెళ్లి ఒకానొక వేడినీటి ప్రవాహాన్ని చూసి, దానిని ఆ సమయంలో దాటిపోతున్న ఒక మహా సర్పం వెన్నుమీదుగా చంద్రవర్మ అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు. తరవాత—]

చంద్రవర్మ సర్పం వెన్నుమీదుగా పరిగెత్తుతూ ప్రవాహంమధ్యకు చేరేసరికి కళపెళలాడుతున్న నీటినుంచి వెచ్చని ఆవిరి అతణ్ణి చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేసింది. తను ధరించిన దుస్తులు మండుతున్నవా అన్న అనుమానంకూడా అతడికి కలిగింది. ప్రవాహ వేగానికి లేచిన కొన్ని అలల నుంచి వేడినీటి తుంపరలు అతడి మీద పడినై. తను స్పృహ కోల్పోయి కింద నీటిలో పడిపోతున్నానేమో అని చంద్రవర్మ కళవెళపడ్డాడు. కాని, యింత భయంలోనూ, అదుర్దాలోనూకూడా అతడు ముందుకు పరిగెత్తుతూనే వున్నాడు. అతడి దృష్టి తనకన్న ముందుగా పరిగెత్తుతున్న కోతులమీదే లగ్నమైవుంది. కొంతసేపటికి అతడి కళ్లకు నేల కనిపించింది. చంద్రవర్మ ఒక్క ఎగురున సర్పం మీదినుంచి కిందికి దూకి చెట్లకేసి పరిగెత్తాడు.



కొద్దిక్షణాల కాలంలో జరిగిపోయిన యీ వింత అనుభవం, చంద్రవర్మను ఆపాదమస్తకం కంపింపచేసింది. అతడు రొప్పుతూ, ఆయాసపడుతూ ఒక చెట్టు బోదెను ఆనుకుని మహాసర్పం వున్న చోటుకేసి చూశాడు. అది యింకా వాగును దాటుతూనే వున్నది. దానికి తన వెన్నుమీదుగా పరిగెత్తిన కోతులను గురించిగాని చంద్రవర్మను గురించిగాని తెలిసినట్టే లేదు. పదీ పన్నెండడుగుల వ్యాసం గల దాని నల్లని తల చంద్రవర్మకు చెట్లలో కొంత దూరాన కనిపించింది. ఎర్రగా నిప్పుకణాల్లా వున్న దాని రెండు కళ్లు చూసి చంద్రవర్మ వణికి



పోయాడు. ఒకవేళ దాని దృష్టి తనమీద పడటం జరిగితే, తను ప్రాణాలతో బయట పడటం అసంభవమని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అదృష్టవశాత్తూ ఆ మహాసర్పం తన తలను చంద్రవర్మకేసి తిప్పలేదు. కొద్దిసేపటి తరవాత దాని తల చెట్లలో మరుగుపడిపోయింది. శరీరభాగం మాత్రం మెల్లిగా ముందుకు జరిగిపోతున్నది.

సర్పం దృష్టి యిక తనమీద పడే అవకాశం లేదని తేల్చుకున్న తరవాత చంద్రవర్మ ధైర్యంగా ముందుకు వచ్చి తాటి బొండులా వున్న దాని శరీరాన్ని పరీక్షగా చూడసాగాడు. దాని శరీరం నూనె పూసినట్టుగా నిగనిగలాడుతున్నది. శరీరానికి కవచంలా అరచేతి వెడల్పున పొలుసులు వున్నవి. బహుశా తను కత్తితో బలంగా పొడిచినా, కత్తి మొక్కపోవటం తప్ప, సర్పం శరీరంలోకి అది దిగటం సాధ్యం కావని అతడు తేల్చుకున్నాడు. కాని, మరుక్షణానే అతడికి అలా కత్తితో దాని శరీరాన్ని పొడిచి చూడాలనిపించింది. చంద్రవర్మ ఒరనుంచి కత్తిని దూసి సర్పాన్ని బలంగా ఒక పోటు పొడిచాడు. ఖంగుమనే శబ్దం వచ్చింది. సర్పానికి ఆ కత్తిదెబ్బ చీమ కుట్టినట్టయినా లేదు.








చంద్రవర్మ మరింతగా ఆశ్చర్యపోతూ చుట్టూ కలయచూశాడు. ఫలభారంతో వంగివున్న చెట్లను చూసేసరికి అతడికి తన ఆకలి సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతడు కత్తిని ఒరలో పెట్టి దాపులవున్న ఒక చెట్టుమీదికి గబగబా పాకాడు. అతడు చెట్టుకొమ్మనుంచి ఒక మామిడిపండును కోసి నోట పెట్టుకోబోయేంతలో భీతి గొల్పే విధంగా ఒక ఏనుగు ఘీంగకరించటం వినబడింది. చంద్రవర్మ చప్పున ఆ ధ్వని వచ్చిన వైపుచూశాడు.

అతడి దృష్టికి ఏనుగు కనిపించలేదు. కాని, అల్లంత దూరంలో చెట్లూ పొదలూ పెనుగాలి తాకిడికి అల్లల్లాడుతున్నట్టు వూగిస లాడి పోవటం కనిపించింది. ఆ వెంటనే మరికొన్ని ఏనుగులు ఘీంకారధ్వని చేయుటం, పెద్ద పెద్ద చెట్టుకొమ్మలు ఫెళ ఫెళా విరిగిన శబ్దం వినపడటం జరిగింది.

చంద్రవర్మ తను వున్న చెట్టుకొమ్మనుంచి చకచకా పాకి చిటారుకొమ్మకు పోయి, ఆ ధ్వనులు వస్తున్న వైపుకు తల తిప్పాడు. అతడి కంటబడిన దృశ్యం ఎంత ధైర్యశాలి లోనైనా భీతిని రేకెత్తించేలా వుంది.

వేడినీటి ప్రవాహాన్ని దాటిన మహాసర్పం ఒక ఏనుగును తన శరీరంతో చుట్టబెట్టి దాన్ని మింగేందుకు పెద్దగా నోరు తెరిచి, ఏనుగు తలను ఒడిసి పట్టుకోబోతున్నది. ప్రాణాపాయ స్థితిలో వున్న ఏనుగు సర్పం పట్టునుంచి బయటపడేందుకు ఘీంకారం చేస్తూ పెనుగులాడుతున్నది. దాని చుట్టూ చేరిన కొన్ని ఏనుగులు భీతితో చెవులు రిక్కించి, తొండాలను ఆకాశంకేసి ఎత్తి, అటూయిటూ దొమ్మిగా పరిగెత్తుతూ ఘీంకార ధ్వనులు చేస్తున్నవి. వాటి కాళ్లకింద పడీ, శరీరాల రాపిడికి విరిగీ అనేక వృక్షాలు పెటపెటమంటూ కూలిపడుతున్నవి. మహా సర్పం మాత్రం తన చుట్టూ జరుగుతున్న ఈ భీభత్సాన్నీ, రణగొణ ధ్వనులనూ



విన్నట్టే లేదు. అది తన శరీరాన్ని ఏనుగు చుట్టూ మరింత బిగువుగా పెనవేస్తూ, క్రమంగా ఏనుగు తలను గుహలాంటి తన నోటిలోకి లాగుకుంటున్నది.

"ఈశ్వరా, నేను మహా భయంకరమైన మరేలోకంలోనో అడుగుపెట్టాను. ఇక నీవే శరణ్యం," అనుకున్నాడు చంద్రవర్మ మనసులో. ఈ వేడినీటి ప్రవాహానికి చుట్టు పక్కల తను చూస్తున్న వైపరీత్యాలతో పోలిస్తే, కాపాలిని వున్న అడవిప్రాంతం వుద్యానవనంలా వున్నట్టు అతడికి తోచింది. తను యింకా అనేక యోజనాల దూరం నడిచి, మాంత్రికుడైన శంఖుడు వుండే గృహం చేరుకోవాలి. కాని, యీ కొద్దిదూరపు ప్రయాణంలోనే తనకు ఎదురైన వింత అనుభవాలతో చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తనకు ఏ దైవశక్తులో సహాయపడితే తప్ప, లేకపోతే యీ భయంకరారణ్యాల్లో, కొండ కనుమల్లో తను మరణించటం తథ్యమని అతడికి తోచింది.

చంద్రవర్మ యిలాంటి వూహలతో తన ధైర్యసాహసాలనూ, ఉత్సాహాన్నీ కోల్పోయి, నీరసంగా చెట్టుకొమ్మల్లోనే సొమ్మసిలిపోయి కళ్లు మూశాడు. అతణ్ణి ఆ క్షణాన ఆకలి దహించటంలేదు. తను నెరవేర్చ పూనిన కార్యం ఎంత దుస్సాధ్యమయిందో అతడికి



తెలిసివచ్చింది. తను మాంత్రికురాలినీ, శంఖుణ్ణీ వాళ్ల కర్మకు వదిలి, మరెక్కైనా పోవటం బావుంటుందేమో అనుకున్నాడు. మరుక్షణం ఎక్కడికి పోవటం? అన్న విషమసమస్య తల ఎత్తింది.

చంద్రవర్మ క్రమంగా మగత నిద్రలోకి జారుకున్నాడు. సూర్యుడు అస్తమించటం గాని, ఆ సమయంలో తమ గుహలకూ, గూళ్లకూ, చేరే పశుపక్ష్యాదులు చేసే కలకలారావాలు గాని అతడికి తెలియవు. క్రమంగా చీకటి పడింది. ఆకాశంలో మిలమిల మెరిసే చుక్కలు తప్ప, చంద్రుడు లేడు. గాలి పూర్తిగా స్తంభించిపోయింది.

అలాంటి వాతావరణంలో సరిగా నడిరేయివేళ చంద్రవర్మను హఠాత్తుగా ఝంఝామారుతం తాకినట్టయి చప్పున కళ్లు తెరవబోయాడు. కాని, యీలోపలే అతని శరీరం చెట్టుకొమ్మల్లోనుంచి గాలితాకిడికి పైకెగిరి పోవటం అతడు గ్రహించాడు. "నా నూరేళ్లాయుస్సూ నిండింది!" అని చంద్రవర్మ అనుకునేంతలో అతడు దభీమంటూ గొంగళిలా గుచ్చుకుంటున్న ఒకచోట వెల్లకిలా పడిపోయాడు. "రాళ్లమీద పడలేదు, బతికిపోయాను!" అనుకుంటూ చంద్రవర్మ లేవబోయేంతలో, తను వున్న ప్రదేశం అటూయిటూ వూగిసలాడటం అతడికి కనిపిం



చిందీ. అతడు ఆశ్చర్యపడుతూ పక్కకు చూశాడు. అతడి దృష్టిని రెల్లుదుబ్బుల్లా వత్తుగా వున్న ఏదో ఆటంకపరిచింది. చంద్రవర్మ తన కళ్లకు అడ్డం వున్నవాటిని చేతితో తాకి చూడబోయేంతలో అతడికి పక్షి ఒకటి మాట్లాడటం వినిపించింది.

"మనం యీరాత్రికి యిక్కడే కాలం గడపటం మంచిది. దగ్గర్లో వున్న వేడినీటి ప్రవాహంనుంచి వచ్చే గాలులు నాకెంతో సంతోషం కలిగిస్తున్నవి," అన్నది పక్షి.

ఆ వెంటనే కొంచెం దాపులనుంచి మరో పక్షి అవునన్నట్టు ధ్వని చేయటం వినిపించింది. చంద్రవర్మకు తృటికాలంలో తను



ఎక్కడ వున్నదీ అర్థమైపోయింది. తను నిద్రిస్తూవుండగా రెండు గండభేరుండపక్షులు తను వున్న చెట్టుదగ్గరకు వచ్చి వాలినై. వాటి రెక్కల తాకిడికి పుట్టిన గాలివల్ల తను చెట్టు కొమ్మల్లోంచి ఎగిరి ఏ రాళ్లమీదనో పడి చావకుండా అదృష్టవశాత్తూ వచ్చి ఒక గండభేరుండపక్షి వీపుమీద పడిపోయాడు. ఏనుగు ప్రమాణంలో వున్న ఆ పక్షికి తను బహుశా ఏ చీమగానో దోమగానో తోచి వుండవచ్చు. కాని, ప్రమాదవశాత్తూ తను ఆ పక్షుల కంటపడటం జరక్కముందే, అక్కడినుంచి మెల్లగా కిందికి దిగి పారిపోవటం మంచిది.

చంద్రవర్మ యిలా ఆలోచించి పక్షి ఈకలలోనుంచి నిశ్శబ్దంగా కిందికి దిగటానికి ప్రయత్నించేంతలో, ఆకాశం మెరిసినట్టయింది. అతడు తల పైకెత్తాడు. ఆకాశంలో భగభగ మండిపోతూ కాంతులు వెదజల్లే ఒక పక్షి రివ్వుమంటూ తను వున్నచోటుకే దిగుతూండటం అతడి కంటబడింది. తక్షణం అతడికి మాంత్రికురాలు చెప్పిన అగ్నిపక్షి సంగతి గుర్తుకొచ్చింది. ఆ అగ్నిపక్షి మాంత్రికుడైన శంఖుడిది.

అగ్నిపక్షి దిగిరావటం చూస్తూనే, గండభేరుండ పక్షులు ముక్కులు పైకెత్తి దానికి



స్వాగతం చెప్పినై. అగ్నిపక్షి సూటిగా కిందికి దిగుతూనే, "మీకోసమే చాలా సేపటినుంచి వెతుకుతున్నాను," అన్నది.

"అలాగా, ఏమిటా పని?" అన్నదొక గండభేరుండ పక్షి.

అగ్నిపక్షి కిందికి దిగి ముక్కుతో రెక్కల నొకసారి సవిరించుకుని, "నా యజమాని శంఖుడు నాకోపని ఒప్పచెప్పాడు. అది ఏమంత కష్టమయింది కాదు. జరాభారంతో కుంగి కృశించిపోతున్న ఒకానొక మాంత్రికురాలిని తనవద్దకు తీసుకు రమ్మన్నాడు. కాని, ఆ పని నావల్ల సాధ్యం కావటంలేదు. నేను పగలు చూడలేను. రాత్రివేళ నా వెలుగు చూస్తూనే, నన్ను గుర్తించి ఆ మాంత్రికురాలు ముందుజాగ్రతలు తీసుకుంటున్నది. కనుక, మీరు చడీ చప్పుడూ లేకుండా యీరాత్రి ఆ మాంత్రికురాలిని ముక్కున కరుచుకుని, నా యజమాని దగ్గరకు తీసుకువస్తే, నేను మీకు సర్వదా కృతజ్ఞురాలినై వుంటాను," అన్నది.

ఆ మాటలు వింటూనే గండభేరుండ పక్షులు ఉస్సురస్సురన్నవి. "మేము యీ రాత్రికి ఒక్క యోజన దూరంకూడా ఎగరలేం. సూర్యాస్తమయం మొదలు యిప్పటి వరకూ సముద్రాల్లోని ఎన్నోదీవులు తిరిగి




పొట్ట నించుకుని, రెక్కల నొప్పులు పోయేందుకు యీ ఉష్ణప్రవాహపు వాయువులదగ్గిర చేరి కునికిపాట్లు పడుతున్నాం. రేపురాత్రికి నీవు కోరిన సహాయం చెయ్యగలం," అన్నవి.

అగ్నిపక్షి సంతోషంగా రెక్కలు రెపరెపలాడించి, ఆ ప్రాంతమంతా మార్మోగేలా పెద్ద కేక పెట్టింది.

"పట్టపగలు ఆ మాంత్రికురాలిని దొరకపుచ్చుకోవటం సాధ్యమయే పనికాదు. అది మహా జిత్తులమారి. పైగా దానిదగ్గిర మహా బలవంతులైన సేవకులు కూడా కొందరున్నారు. ఎన్నో ఏళ్లుగా ఆ మాంత్రికురాలు రాత్రివేళ కూడా కన్ను మూయకుండా



బతుకుతూ వచ్చింది. కాని, ఆ మధ్య దానికి దేహారోగ్యం చెడటంతో, లోగడ వున్నంత మెలకువగా వుండటం లేదు. మీరు చీకటిమాటున పొంచివుండి, హఠాత్తుగా మీదపడి ముక్కుతో దాని కంఠాన్ని అడకత్తెరలోలాగా పట్టుకోగలిగారంటే, అది మంత్రోచ్చారణ చేయలేదు గనక, మీకు ఎలాంటి హానీ కలిగించలేదు. ఆ తరవాత మీరు సరాసరి నా యజమాని శంఖుడు వుండే కొండదగ్గిరకు వచ్చి, ఆ మాంత్రికు రాలిని అతడి పాదాల ముందు పడవేస్తే— దానికి తగిన శిక్ష, మీ యిద్దరికీ తగిన ప్రతిఫలం అతడు తప్పక యిచ్చుకుంటాడు," అన్నది అగ్నిపక్షి.

"నాకు నీ యజమాని మరేమంత పెద్ద ప్రతిఫలం ముట్టచెప్ప నవసరం లేదు. ఇచ్ఛామాత్రాన సప్తసముద్రాల్లోని అన్ని దీవులకూ పోగలిగే శక్తినిస్తే చాలు," అన్నది ఒక గండభేరుండపక్షి.

"నాకు అంత పెద్ద ఆశ లేదు. చావనేది లేకుండా చేయగలిగిన మంత్రం ఏదైనా వుపదేశిస్తే చాలు," అన్నది రెండవ పక్షి.

"ఈ పిచ్చిపక్షులు రెండూ మాంత్రికుడైన శంఖుణ్ణి దేవుడనుకుంటున్నట్టుంది!" అనుకుని చంద్రవర్మ నవ్వుకున్నాడు.

గండభేరుండపక్షులు అడిగినదానికి అగ్నిపక్షి అవును కాదనకుండా తలాడించి, "రేపు పగటివేళ నా నివాసానికి ఒకసారి రాగలరా? వీలయితే నా యజమానినికూడా మీకు చూపెడతాను," అన్నది.

గండభేరుండపక్షులు సరేనన్న సూచనగా తలలాడించినై. మరుక్షణం అగ్నిపక్షి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరి మహావేగంతో ఉత్తరదిక్కుకేసి వెళ్లిపోయింది. గండభేరుండపక్షులు కొంచెంసేపు ఆ సంగతీ యీ సంగతీ మాట్లాడుకుని ముక్కులను భూమికానించి నిద్రలోకి జారుకున్నవి.

—(ఇంకా వుంది)



# కోడిసంచారం

ఒకనాడు ఒక కోడికి కొంగల అరుపులు వినిపించాయి. అది తల ఎత్తి చూసే సరికి ఒక కొంగల బారు దక్షిణంగాపోతూ కనిపించింది.

ఎన్నడూ తన ఆవరణ దాటివెళ్లని కోడికి కొంగలలాగే సంచారంచేసి రావాలనిపించి, "నేనుకూడా దక్షిణం వెళ్లివస్తాను," అని మిగిలిన కోళ్లకు చెప్పి అది దక్షిణంగా రెక్కలాడించుకుంటూ పరిగెత్తింది. ఆవరణదాటగానే రోడ్డు వచ్చింది. రోడ్డుపైన బళ్లు నడుస్తున్నాయి. కోడి రోడ్డువెంబడి కొంతదూరం పరిగెత్తి ఒక తోటను చూసింది. అందులో పూలచెట్లున్నాయి, తోటమాలి వాటికి నీళ్లు పోస్తున్నాడు. మరికొంతదూరాన రోడ్డు ఆగిపోయింది. అక్కడ ఒక వంగ తోట ఉన్నది.

సాయంకాలానికల్లా కోడి ఇంటికి తిరిగివచ్చి తానుచూసిన వింతలు ఇతర కోళ్లకు చెప్పింది.

నాలుగు నెలలు గడిచాక దక్షిణంగా వెళ్లిన కొంగలు తిరిగి వచ్చాయి. వాటిలో కొన్ని కోళ్లను కలుసుకుని, "దక్షిణాది నుంచి వస్తున్నాం. అక్కడ సముద్రం ఉన్నది, ఎన్నో లంకలున్నాయి!" అని చెప్పాయి.

"దక్షిణాన సముద్రం ఎక్కడ ఉన్నది? మా కోడికూడా ఈమధ్యన దక్షిణం వెళ్లి తిరిగివచ్చింది. అక్కడ ఏమున్నదీ మా కోడినడగండి చెబుతుంది!" అన్నాయి కోళ్లు.





# తారుమారు

ఇల్లీరియా దేశానికి అర్సినో రాజుగా ఉంటూండేవాడు. అయనకు పెళ్లి కాలేదు. కాని ఆయన ఒలీవియా అనే ఒక గొప్ప యింటి సుందరిని ప్రేమించి, ఆమె అంగీకరించినట్లయితే పెళ్లాడాలనే ఉద్దేశంతో ఉన్నాడు.

అయితే ఒలీవియా రాజును ప్రేమించలేదు. కొద్ది మాసాలు తేడాగా ఆమె తన తండ్రినీ, అన్ననూ పోగొట్టుకున్నది. ఆ వంక పెట్టి ఆమె రాజు నిత్యమూ పంపే దూతలకు దర్శనమివ్వ నిరాకరించి, "ఏడేళ్లపాటు నేను శోకసముద్రంలో నుంచి బయటికి రాదలచ లేదు. అందుచేత ఈ ఏడేళ్లూ నేను ఎవరినీ చూడదలచ లేదు," అని రాజ దూతలకు తన నౌకర్లచేత చెప్పించింది.

ఏడేళ్లపాటు తన ప్రియురాలికి ప్రేమ సందేశాలు పంపే అవకాశంకూడా లేనందుకు అర్సినో మహారాజు కుంగిపోయి, తాను కూడా శోకసముద్రంలో మునిగిపోయిన వాడయాడు.

రాజుగారి పరిస్థితి ఇలా ఉండగా, ఇల్లీరియా తీరానికి సమీపంలో ఒక ప్రయాణీకుల నౌక మునిగిపోయింది. ఆ నౌకలో చాలామంది ప్రయాణీకులున్నారు. వారిలో ఇద్దరు కవలపిల్లలు; మెసలీన్ నగరానికి చెందినవారు. వారు ఒక గంట వ్యత్యాసంలో పుట్టారు, ఇద్దరూ ఒకే రూపురేఖలు గలవారు. చిన్నతనంలో వారిని వేరువేరుగా పోల్చ గలందులకు వారి తల్లి వేరువేరు దుస్తులు వేసేది. వారిలో పెద్దవాడు మగపిల్లవాడు; అతని పేరు సెబాస్టియన్. రెండవది ఆడపిల్ల; ఆమె పేరు వయోలా.

పడవ మునిగినప్పుడు పడవ నాయకుడు కొద్దిమందిని చిన్న తెప్పలో రక్షించి ఇల్లీరియా తీరానికి చేర్చాడు. వారిలో వయోలా ఉన్నది గాని, సెబాస్టియన్ లేడు.

అర్. కోదండరామయ్య

వయోలా తాను బతికి బయట పడి నందుకు సంతోషించక, తన అన్న సముద్రం పాలైనాడేమోనని బెంగపడసాగింది. పడవ నాయకుడు ఆమెను ఓదార్చుతూ, "అమ్మా, మీ అన్నకేమీ భయంలేదు. పడవ మునిగిన కొంతసేపటికి అతను తెరచాపకొయ్య ఒకటి పట్టుకుని తేలుతూ, ఈదుకు పోతూండటం నేను కళ్లారా చూశాను. అతను తప్పక ఎక్కడో ఒకచోట ఒడ్డు చేరుకుంటాడు. కాని ఆడదానివీ, ఒంటిదానివీ అయిన నీవు ముందుగతి ఏమిటో ఆలోచించుకో! నీకు ఏదో ఒక మంచిచోట ఆశ్రయం చూసిగాని నేను వెళ్లను," అన్నాడు.



పడవ నాయకుడి మాటలు వయోలాకు కొంత ఉత్సాహం కలిగించాయి. ఆమె నాయకుణ్ణి, "ఇది ఏ దేశం? ఇక్కడ రాజెవరు?" అని అడిగింది. ఆర్సినో పేరు విని, "కొంత కాలం క్రితం నేనీయనను గురించి విన్నప్పటికి ఆయన ఇంకా పెళ్లి కాలేదు!" అన్నది.

"అమ్మా, అదొక పెద్ద గొడవ!" అంటూ పడవనాయకుడు ఆయన ప్రేమ కథ గురించీ, ఒలీవియాను గురించీ చెప్పాడు.

"పాపం, ఆమె తండ్రీ, అన్నాకూడా పోయారా? అన్నకు దూరమై బెంగపడి ఉన్న నేను ఆమె వద్ద పరిచారికగా చేరితే ఒకరికొకరం తోడుగా ఉంటామే!" అన్నది.

"అది జరిగే పని కాదమ్మా. అన్నపోయిన శోకంలో ఉండి ఆ ఒలీవియా కొత్తవారి ముఖాలు చూడటమే మానేసింది." అన్నాడు పడవ నాయకుడు.

"అలా అయితే రాజుగారి దగ్గిర మగ వేషంతో నౌకరీ చేస్తే ఎలా ఉంటుంది? ఒంటరి ఆడదానికి మగవేషాన్ని మించిన రక్షఉండదు గదా!" అన్నది వయోలా. అందుకు తగిన సహాయం చెయ్యటానికి పడవనాయకుడు ఒప్పుకున్నాడు. ఆమె అతనికి కొంత డబ్బిచ్చి, అచ్చగా తన అన్న

ధరించిన దుస్తులవంటివే కొనుక్కు రమ్మని చెప్పింది. పడవనాయకుడు అలాగేచేశాడు.

అతను కొనితెచ్చిన దుస్తులు ధరించిన మీదట వయోలా ముమ్మూర్తులా సెబాస్టియన్ లాగే తయారయింది. పడవనాయకుడు ఆమెను వెంటబెట్టుకుని ఆర్సినో మహారాజు వద్దకు వెళ్లి, "మహారాజా, ఈ యువకుడి పేరు సిజారియో. మా పడవ సముద్రంలో మునిగిపోగా ఎలాగో ఇతన్ని రక్షించి ఇక్కడికి చేర్చాను. గొప్పయింటివాడైన ఈ యువకుణ్ణి మీ పరిచారకుడుగా పెట్టుకుంటే, మీకు సేవచేస్తూ ఇక్కడే ఉండిపోతాడు!" అన్నాడు.

రాజుకు ఆ యువకుణ్ణి చూసి ముచ్చట వేసింది, ఆయన అతణ్ణి తనవద్ద ఉంచుకోవటానికి ఒప్పుకున్నాడు.

వయోలా రాజుగారి పరిచారకుడుగా కొలువు కుదిరినప్పటికీ మొదటిరోజునుంచి కూడా ఆమె రాజుగారి అంతరంగిక మిత్రుడై పోయింది. ఆయన ఆమె దగ్గిర తన ప్రేమను గురించీ, ఒలీవియా కఠినత్వం గురించీ వెళ్ళబోసుకుని నిట్టూర్చాడు. ఆమె తన ప్రేమను స్వీకరించలేదన్న విచారంతో ఆయన అన్ని సుఖాలకూ విముఖుడై, అస్తమానం ప్రణయ గీతాలు పాడించుకుని వింటూ కాలం గడుపుతున్నాడు. మగవేషం వేసుకుని



మారుపేరుతో వయోలా తన కొలువు ప్రవే శించినది మొదలు ఆయన అచ్చగా ఆమె తోనే కబుర్లు చెప్ప నారంభించాడు.

ఇది వయోలాకు ప్రమాదంగా పరిణ మించింది. ఎందుచేతనంటే ప్రేమ అంటు వ్యాధిలాగా ఆమెకుకూడా సోకి, ఆమె రాజును ప్రేమించ నారంభించింది. ఒలీ వియాను ప్రేమించి రాజు ఎలాటి బాధ పడు తున్నాడో, రాజును ప్రేమించిన వయోలా కూడా అలాటి బాధే పడసాగింది. తన ప్రేమను నేరుగా బయట పెట్టలేక ఆమె మాటల సందర్భంలో వ్యంగ్యంగా బయట పెడుతూ వచ్చింది.

ఒకసారి రాజు, "ప్రేమించటం పురుషు లకే తెలుసు, స్త్రీలకు ఏమీ తెలియదు. అందుచేతనే ఒలీవియాకు నా ప్రేమ అర్థం కావటంలేదు," అన్నాడు.

"అలా అనకండి, మహారాజా! నాకొక సహోదరి ఉండేది. ఆమె ఒక పురుషుణ్ణి ప్రేమించింది. ఆ ప్రేమను తన హృదయంలో దాచుకున్నది. అది పండులో పురుగులాగా తన హృదయాన్ని తొలిచి బాధ పెట్టినా చలించక పైకి నవ్వుముఖం పెట్టి తిరిగింది," అన్నది వయోలా.

వీరిలా మాట్లాడుకుంటూండగా రాజు గారు ఒలీవియా వద్దకు పంపిన ఉద్యోగి వచ్చి,





ఆమె కనీసం దర్శనమిచ్చి చెప్పినమాటలు వినేది!" అన్నాడు.

"మాట్లాడితే నేనేమని చెప్పాలి, మహా రాజా?" అన్నది వయోలా.

"నే నామెను ఎంతగా ప్రేమిస్తున్నానో, ఆమెకోసం ఎంతగా తపిస్తున్నానో వివరించి చెప్పు," అన్నాడు రాజు.

తనకు ఈ పని ఏమాత్రమూ రుచించక పోయినా వయోలా ఒలీవియా ఇంటికి వెళ్ళింది. ఒలీవియా దాసీది ఆమెకు తలుపు తీసి, "అమ్మగారికి ఒంట్లో బాగాలేదు," అని చెప్పింది.

"నాకు తెలుసు. నేనామెను చూడాలి," అన్నది వయోలా.

"నిద్రపోతున్నారు," అన్నది దాసీ.

"అందుకే మాట్లాడి పోదామని వచ్చాను," అన్నది వయోలా కొంటెగా.

దాసీది వెళ్లి ఒలీవియాతో, "అమ్మా, తమర్ని చూడటానికి ఎవరో యువకుడు వచ్చి ఎన్ని విధాల చెప్పినా వెళ్లిపోవటం లేదు. మొండి ఘటంలాగా కనబడు తాడు," అన్నది.

ఈ మొండివాడెవడో చూడాలని ఒలీ వియాకు కుతూహలం కలిగింది. అందుచేత, "ఆ మనిషిని లోపలికి రానీ," అన్నది.

"మహారాజా, ఒలీవియాగారు ఇంకా ఏడేళ్ల దాకా ఎవరి ముఖమూ చూడరట. తన దగ్గిరికి ఎవరినీ పంపవద్దని ఖచ్చితంగా చెప్పారు!" అన్నాడు.

"అన్నకోసమే ఇంత శోకించే మనిషి మనసు ఎంత కోమలమై ఉండాలి! అలాటి మనిషికి నాపై ప్రేమే కలిగితే ఇక వేరే చెప్పాలా?" అన్నాడు రాజు. తరవాత ఆయన వయోలాకేసి తిరిగి, "సిజారియో, ఈసారి నాదూతగా ఒలీవియా వద్దకు నీవే వెళ్లిరావటం బావుంటుంది. ఆమె దగ్గిరకు వయసుమళ్లినవారిని పంపటం నాదే పొర పాటు. నీవంటి యువకుణ్ణి పంపితే

వయోలా లోపలికి వచ్చి ప్రబంధ నాయకుడిలాగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ, "ఓ జగదేకసుందరీ, భువనైక మోహినీ, నీవేనా ఈ ఇంటికి యజమానురాలవు? ఎందుచేతనంటే ఈ ఇంటి యజమానురాలికోసం నేనొక సందేశం తెచ్చాను. చాలా కష్టపడి తయారుచేసిన సందేశం. దాన్ని నేనెంతో శ్రమపడి కంఠస్థం చేసుకున్నాను," అన్నది.

"అయ్యా, మీరెక్కడినుంచి వస్తున్నారు? ఆ సంగతి ముందు చెప్పండి," అని ఒలీవియా అడిగింది.

"ఆ ప్రశ్నకు సమాధానం నేను కంఠస్థం చేసుకోలేదు," అన్నది వయోలా కొంటెగా.

"మీరేమైనా విదూషకులా?" అని ఒలీవియా అడిగింది.

"నేను వేషధారినని ఒప్పుకుంటాను గాని విదూషకుణ్ణి కాను," అన్నది వయోలా. "నీవీ ఇంటి యజమానురాలవైతే ఒక్కసారి నీ ముఖం చూడాలని ఉన్నది, మేలి ముసుగు తొలగిస్తావా?"

ఒలీవియా తన మేలిముసుగు తొలగించింది. జరిగినదేమంటే రాజుగారి ప్రేమను అంతకాలం తృణీకరించిన ఒలీవియా కొద్ది నిమిషాలలోనే ఈ యువకుణ్ణి



ప్రేమించింది. ఆకస్మికంగా కలిగిన ఈ ప్రేమ మూలంగా తాను ఏడేళ్లపాటు ఇతరుల ముఖం చూడరాదనుకున్న విషయంకూడా మరిచిపోయింది.

"నీలో అందం చాలా ఉన్నది గాని నీకు హృదయంలేదు. మా యజమాని అయిన రాజుగారు నీకోసం తపస్సు చేస్తున్నాడు, నిట్టూర్పుతున్నాడు. ఆయన మొర ఎందుకు ఆలకించవు?" అన్నది వయోలా.

"నేనాయనను ప్రేమించటం లేదు. ఆ సంగతి ఆయనకు తెలుసును. ఆయన నన్ను అకారణంగా బాధిస్తున్నారు," అన్నది ఒలీవియా.

"నేనే నిన్ను ప్రేమించి ఉన్నట్టయితే నీ చూరు పట్టుకుని వేళ్లాడి, దశదిశలూ పిక్కటిల్లేలాగా నీ పేరు గట్టిగా కేకలు పెట్టి ఉందును. నీకు నాపైన మనసు మారేదాకా ఊపిరి సలపకుండా చేసిఉందును!" అన్నది వయోలా.

"సరే, మీరు వెళ్లి మీరాజుతో నేనాయనను ప్రేమించలేనని చెప్పండి. అందుకాయన ఏమన్నదీ వీలుంటే నాతో వచ్చి చెబుదురుగాని!" అన్నది ఒలీవియా.

వయోలా బయటికి వెళ్లాక ఒలీవియా తన దాసీని పిలిచి, "ఒసే, ఇప్పుడు వెళ్లిన యువకుడు ఈ ఉంగరం ఇక్కడ వదిలి వెళ్లాడు. దీన్ని అతనికి ఇచ్చిరా!" అని చెప్పి పంపింది. తాను ప్రేమిస్తున్నట్టు సిజారియోకు ఎలాగైనా తెలియజేయాలనే ఒలీవియా ఉద్దేశం.

దాసీది తెచ్చి ఇచ్చిన ఉంగరం చూడగానే వయోలాకు అంతా అర్థమయింది. ఎందుకంటే ఆమె తనవెంట ఏ ఉంగరమూ తీసుకురాలేదు, ఒలీవియా ఇంట మరిచి పోనూ లేదు. "అయ్యో, ఈ మారువేషం ఒలీవియాను ఎంత మోసగించింది! నేను రాజుకోసం నిట్టూర్చటం ఎంత నిరర్థకమో, ఒలీవియా నాకోసం నిట్టూర్చటమూ అంత నిరర్థకమే!" అనుకున్నదామె.



ప్రేమ గుడ్డిది. వయోలా తిరిగి వచ్చి, "మహారాజా, ఒలీవియాతో మాట్లాడాను. ఆమె మిమ్మల్ని ప్రేమించలేనని గట్టిగా చెప్పింది," అన్నప్పటికీ రాజుకు నిరాశ కలగలేదు.

"సిజారియో, నీవు సగం విజయం సంపాదించావు. ఆమె నిన్ను చూసి మాట్లాడింది. రేపు మళ్లీ వెళ్లావంటే ఆమె మనసును కూడా నాకేసి తిప్ప గలుగుతావు!" అన్నాడాయన వయోలాతో. తరవాత ఆయన ఒక జానపద ప్రేమగీతం పాడ సాగాడు. ఆ పాట వినగానే వయోలా కంట కన్నీరు కారింది.

"ఇదేమిటి, సిజారియో ? ఇంత చిన్న తనంలోనే ప్రేమసర్పం నిన్నుకూడా కాటు వేసిందా ?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో. వయోలా అవునన్నది.

"ఆ స్త్రీ ఎవరు ? ఎలా ఉంటుంది ? ఇంతకాలంగా నాతో మాటమాత్రం చెప్ప లేదేం ?" అన్నాడు రాజు.

"మహారాజా, ఆమె మీ వయసుదే. మీలాగే ఉంటుంది," అన్నది వయోలా.

ఈ మాటకు రాజు నవ్వుకున్నాడు; "అర్భకుడు, ఏమీ ఎరగడు! లేకపోతే తనకన్న వయసుగలదాన్ని ప్రేమించట మేమిటి ?" అనుకున్నాడు.





మర్నాడు వయోలా రాగానే ఆమెను దాసీలు నేరుగా ఒలీవియా ఉన్న చోటికి తీసుకుపోయారు.

"మా రాజుగారి తరఫున ప్రేమభిక్ష వేడటానికి మళ్లీ వచ్చాను," అన్నది వయోలా.

"ఆయన ప్రసక్తితెస్తే నేను వినేదిలేదు. మరెవరి తరఫున అయినా మాట్లాడితే సంతోషంగా వింటానేమో!" అన్నది ఒలీవియా, తన రహస్యాన్ని బట్టబయలుచేస్తూ.

ఆమె ఆ మాట అనగానే వయోలా ముఖం చిట్లించి ఏవగింపు కనబరిచింది. అది చూసి ఒలీవియా, "నేనంటే నీకెందుకంత తృణీకారభావం? నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఈ ప్రేమను దాచటంకూడా నాకు చాతకావటం లేదు. అయినా దాచవలిసిన అవసరంమాత్రం ఏమున్నది?" అన్నది.

"నీ ప్రేమ నిరూపయోగం. ఎందుచేతనంటే నేను నా జన్మలో ఎన్నడూ ఆడదాన్ని ప్రేమించబోను!" అంటూ వయోలా చరచరా వెళ్లిపోయింది. ఆమె కొద్దిదూరం వెళ్లిందోలేదో, ఆమెను ఒక పెద్దమనిషి అటకాయించి తనతో ద్వంద్వయుద్ధం చెయ్యమన్నాడు.

ఈ పెద్దమనిషికూడా రాజులాగే ఒలీవియాను ప్రేమించినవాడు. తనను నిరాకరించిన ఒలీవియా రాజుగారి దూతను, సిజారియో అనేవాణ్ణి ప్రేమిస్తున్నదని అతను దాసీలద్వారా తెలుసుకుని వేచిఉన్నాడు.

ఈ మనిషి కత్తి దూసి, తననుకూడా కత్తి దూసి యుద్ధానికి రమ్మని ఆహ్వానించగానే వయోలా గుండె అవిసిపోయింది. ఆమె తాను పురుషుణ్ణి కానని చెప్పేద్దామనుకుంటూండగా ఇంకొక మనిషి దేవుడల్లే ఎక్కడినుంచో వచ్చి, కత్తి దూసినవాడితో, "అయ్యా, ఈ యువకుడు మీకేమైనా అవమానం చేసిఉంటే అందుకు నేను పూచీ పడతాను. నాతో యుద్ధం చెయ్యండి,"

అంటూ తానుకూడా కత్తి దూశాడు. ఇంతలోనే రక్షకభటులు వచ్చి ఆ మనిషిని కాస్తా పట్టుకున్నారు.

ఇదంతా వయోలాకు చిత్రమైన కలలాగున్నది. తనను రక్షించటానికి వచ్చిన మనిషి ఎవరో, అతనిని రక్షకభటు లెందుకు పట్టుకుని బంధించారో ఆమెకు త్వరలోనే అర్థమయింది.

అతను వయోలాకేసి తిరిగి, "చూశావా, నీ మూలంగానే నాకీ గతి పట్టింది. నేను ఇల్లీరియాలో అడుగు పెట్టనంటే కాదు కూడదని తెచ్చావు. కొన్ని ఏళ్లక్రితం ఒక యుద్ధంలో నేనీ దేశపు రాజుగారి మేనల్లుణ్ణి గాయపరిచాను. అందుచేత నన్ను దేశ బహిష్కారం చేశారు. ఇప్పుడు డబ్బిస్తేగాని నన్ను వదలరు. నేను నీకిచ్చిన డబ్బుసంచీ ఇలాతే!" అన్నాడు.

అతను సెబాస్టియన్‌ను సముద్రంనుంచి రక్షించిన ఒక సరంగు. ఇల్లీరియా చేరగానే తన డబ్బుసంచీ ఇచ్చి, "నీకు కావలిసిందేమైనా ఉంటే కొనుక్కో," అని పంపాడు. ఇప్పుడతను వయోలాను మగవేషంలో చూసి సెబాస్టియనేనని భ్రమపడ్డాడు.

"అయ్యా, మీరెవరో నేనెరగను. మీరు నాకు డబ్బివ్వ లేదు," అన్నది వయోలా.




రక్షకభటులు అతన్ని పట్టుకుపోయారు. వెళ్లేటప్పుడా మనిషి వయోలాతో, "సెబాస్టియన్, స్నేహితుడిపట్ల ఇంత ద్రోహం చేస్తావని నేను కలలోకూడా అనుకోలేదు!" అని నిష్ఠురాలాడి వెళ్లిపోయాడు.

తన అన్న ఇల్లీరియాలోనే ఉన్నాడన్నది ఈ మాటలతో వయోలాకు స్పష్టమయింది. కాని ఇక తాను అక్కడే నిలబడితే ఆ కత్తి దూసినవాడు మళ్లీ యుద్ధానికి రమ్మంటాడని భయబడి తానుకూడా గబగబా రాజగృహంకేసి వెళ్లిపోయింది.

కత్తి దూసినవాడు మాత్రం అక్కడే తారట్లాడుతున్నాడు. కొద్దిసేపటికల్లా తన



వైరి మళ్లీ వస్తున్నట్టు అతనికి కనబడింది. ఈసారి వచ్చినది వయోలా కాదు, ఆమె అన్న అయిన సెబాస్టియన్.

"నాతో యుద్ధం చెయ్యకుండా పారిపోయి మళ్లీ వచ్చావా? ఇదుగో, ఈసారయినా కత్తి దూస్తావా?" అంటూ ఆ మనిషి సెబాస్టియన్ చెంపమీద ఒక్కటి పెట్టాడు. సెబాస్టియన్ పిరికివాడు కాడు; తనను అకారణంగా కొట్టిన ఆ అపరిచితుణ్ణి గూబ అదిరేటట్టు తిరిగికొట్టాడు. ఇద్దరూ కత్తులు దూశారు.

తన ఇంటి సమీపంలో ఈగలాటా జరగటం చూసి ఒలీవియా బయటికి వచ్చి వారిద్దరినీ విడదీసి, సెబాస్టియన్‌ను చెయ్యి పట్టుకుని తన ఇంట్లోకి తీసుకుపోయింది. అతను సిజారియోయేనని ఆమె అనుకున్నది. కాని సెబాస్టియన్‌లో కొంత మార్పుండటం ఆమె గమనించింది. ఇతను అదివరకులాగా తనను చూసి ముఖం చిట్లించలేదు, చెయ్యి ఇస్తే అప్యాయంగా పట్టుకున్నాడు, తనకేసి ప్రేమగా చూశాడు.

తనను ఎన్నడూ చూడని ఆడది తనతో అంత ప్రేమగా ఎందుకు మాట్లాడుతున్నదీ సెబాస్టియన్‌కు అర్థం కాలేదు. ఒకవేళ ఆమెకు మతి సరిగా లేదేమో అనుకున్నాడు. కాని ఇతర విషయాలలో ఆమె ఏమాత్రమూ పిచ్చిదానిలాగా లేదు. దాసీలు ఆమెను మామూలు మనిషిలాగే చూసి, ఆమె ఆజ్ఞలు నిర్వర్తించుతున్నారు.

తన ప్రియుడు మంచి బుద్ధిన ఉండటం గమనించి ఒలీవియా, "మళ్లీ అలస్యమెందుకు? ఇప్పుడే పురోహితుణ్ణి పిలిపిస్తాను. మనం పెళ్లి చేసేసుకుందాం!" అన్నది. ఆమె గొప్ప ఇంటిది, చాలా అందగత్తె. అందుచేత సెబాస్టియన్ సరేనన్నాడు.

పెళ్లి అయిపోయింది. ఈ శుభవార్తను తన మిత్రుడైన సరంగుతో చెప్పటానికి సెబాస్టియన్ బయలుదేరి వెళ్లాడు. మరి కాస్సేపటికల్లా రాజుగారు వయోలాతోసహా

స్వయంగా బయలుదేరి ఒలీవియా ఇంటికి వచ్చాడు. ఆయన ఆ ఇంటి ముందరికి వచ్చేసరికి రక్షకభటులు సరంగునుకూడా అక్కడికి తెచ్చారు.

సరంగు రాజుగారితో, "మహారాజా, ఈ యువకుడి మూలంగా నేను ఈ దేశంలో అడుగు పెట్టవలిసివచ్చింది. ఇతన్ని నేను సముద్రంనుంచి కాపాడి, మూడు నెలలుగా ఇతని ఖర్చులన్నీ భరిస్తూ పోషించాను. ఈ కృతఘ్నుడికి నా డబ్బంతా ఇచ్చేశాను. జరిమానా కట్టుదామంటే డబ్బివ్వక నిరాకరిస్తున్నాడు," అంటూ మగవేషంలో ఉన్న వయోలాను చూపాడు.

రాజు సరంగుతో, "నీకేమైనా మతి పోయిందా ఏమిటి? ఈ కుర్రవాడు మూడు నెలలుగా నా కొలువులో ఉన్నాడు. నువు ఇతన్ని పోషించానంటావేమిటి?" అన్నాడు.

ఇంతలో ఒలీవియా బయటికి వచ్చింది. ఆమె రాజువెంట ఉన్న వయోలాను చూసి తనను పెళ్లాడిన యువకుడే అనుకుని, ఆమెతో ప్రేమగా మాట్లాడసాగింది.

తన భృత్యుడైన సిజారియో తన దూతగా పని చేస్తున్నట్టు నటిస్తూ తనకు ద్రోహం చేశాడని రాజుకు కోపం వచ్చింది. "నీ సంగతి చెబుతాను, నావెంట రా!" అని ఆయన వయోలాతో అన్నాడు.



"మహారాజా, మీరు నన్ను చంపించినా ఆనందంగా చస్తాను!" అన్నది వయోలా.

"అయ్యో, నా సిజారియోను ఎక్కడికి తీసుకుపోతున్నారు?" అని ఒలీవియా విల విలలాడింది.

"నేను అందరికన్నా ఎక్కువగా ప్రేమించేవారివెంట పోతున్నాను!" అన్నది వయోలా.

"అయ్యయ్యో, కొంచం ఆగండి. మా కిద్దరికీ ఇంతకు ముందే వివాహమయింది. పెళ్లి చేయించిన పురోహితుడుకూడా ఇంకా వెళ్లిపోలేదు," అన్నది ఒలీవియా.

"ఇది పచ్చి అబద్ధం! నేను నిన్ను పెళ్లాడలేదు!" అన్నది వయోలా.

ఒలీవియా పురోహితుణ్ణి పిలిపించింది. తానే స్వయంగా వారిద్దరికీ వివాహం చేయించానని పురోహితుడు చెప్పాడు. ఆ సాక్ష్యాన్ని రాజు నమ్మాడు. ఆయన వయోలాతో, "నువు నన్నిలా మోసగిస్తా వనుకోలేదు. ఇక ఎన్నటికీ నాకు నీ ముఖం చూపించకు!" అంటూ వెళ్లిపోబోయాడు.

ఇంతలోనే సెబాస్టియన్ ఎదురుగా వచ్చాడు. అచ్చు ఒక్కటిగానే కనిపించే సెబాస్టియన్‌నూ, వయోలానూ చూసి రాజూ, ఒలీవియా, పురోహితుడూ, అందరూ నివ్వెరపోయారు.

కాని అన్నను చూడగానే వయోలా తాను పురుషవేషం వేసుకున్న స్త్రీనని బయట పెట్టింది. సెబాస్టియన్ సరంగును గుర్తించి అతనికి డబ్బు సంచీ ఇచ్చేశాడు. రాజు గారికి తన భృత్యుడు నిర్దోషి అని తెలిసి పోవటమేకాక, జరిగినదంతా జ్ఞాపకం తెచ్చు కుంటే ఆమె తనను ఇంత కాలమూ ప్రేమించిందనికూడా అర్థమయింది. ఒలీ వియా ఎలాగూ పెళ్లిచేసేసుకుంది గనక, ఆ పురోహితుడి సహాయంతోనే రాజు వయో లాను పెళ్ళాడాడు. తరవాత అందరూ సుఖంగా ఉన్నారు.





# బుద్ధి ప్రకాశం

కోతి :

కలదొక్క పురి రథ-కారుం డొకండు
కలవాడు కాదు మి-క్కిలి పేదవాడు.
కట్టినా డెన్నొ చ-క్కని మిద్దెమేడ
లట్టియ్యు చేతికి - అందిరాదయ్యె.
అందఱ కున్నవి - అందాలమేడ
లెందున చేరుదు; - కందువే నాకు
కఱవయ్యెనని, వాడు - కటకటపడుచు
బిరబిర ఎటకైన - వెడలగా దలచె.
పోవుచునుండ వ-నావళిలోన
దోవతప్పిన ఒంటె - దురపిల్లుచుండె.
సరి దానికింత ప-చ్చని గడ్డివేసి
మఱిమఱి కాపాడి - మందిరమ్మునకు
పిల్లను తల్లిని - పిలుచుకవచ్చి
చల్లగా సాకుచు - కొల్లగ పాలు
పిదికి, ఇంటందఱు - ప్రేమ నున్నారు.
ఇది మంచిదని వాడు - తృప్తుడై ఒంటె
కదుపును జేర్చె నిం-కను కొనితెచ్చి
పదులు పదుల్ వంద - పదులయ్యె నవ్వి.
తొలిదూడ మెడను గం-టలు గట్టె వాడు
బలిసి ఆ దూడ ఉ-ప్పరమును దాకె.
మేతకు వెళ్ళిన - మిగత దూడలను
కాతరుచేయక - కదలు దూరముగ.
అవి చెప్పిచూచె ఈ-యడవి నొంటరిగ
దవిలి చరింపగా - తగదంచు చాల.
ఆ మాట విననట్టి - ఆ దూడ ఒకట
భీమసింహము వాత - బిరబిర పడియె.
మంచిమాటను త్రోసి - మడిసె నా దూడ
మంచిమాటను త్రోసి - మాడెద వీవు.

మొసలి :

ఇటు నన్ను బాధింప - నిది తగవౌనె?
ఎటుల నాయింటి నే - నిక లాగుకొందు.

కోతి :

సరిసమానులతోడ - సమరమే మేలు
పర శత్రువులతోడ - వరము సామమ్ము.
ఈ నీతి దెల్పగా - నే నొక కథను
వీనులవిందుగా - వినిపింతు వినుము.
ఒక నక్క అడవిలో - నకనకలాడి
ఒకచోట గనియె - నె-దో పెద్ద శవము.
దఱిచేరి చచ్చిన - కరి గాంచి మించి

విద్వాన్ విశ్వం

కొఱుకుడు పడకున్న - దురపిల్లుచుండె.
అటు సింహమేగ "న-య్యా రండు రండు
ఇట నున్న యేన్గు మీ-కే, చూచుచుంటి"
అన సింహ మది చూచి - అన్యులు చంపు
కొనిన దానిని ముట్టు-కొనము మేమనియె.
తరువాత నొక పులి - సరగున రాగ
పరువడి నక్క ఆ-పాటను మార్చె.
"పులిమామ! సింహమ్ము - పాలిసేసి పోయె;
కల దట; నిల్చిన - కలుగును ముప్పు
పులి వచ్చినం జాలు - పాలిసేతు ననియె
చలపట్టినది సుమ్ము - పలుమాట లేల"
ఆ మాటకా పులి - అదరియే పోయి
"ఈ మాట చెప్పకు - నే పారిపోదు"
నని తోక ఝాడించె - నంతలో చిఱుత
గని కొఱికిన చాలు-నని చూడ నదియు
అటు రాగ మెల్లగా - నది యిది చెప్పి
"తటుకున తిను కొంత - తామసమైన
వచ్చు సింహమ్మన - పాపమా చిఱుత
కచ్చులు వెట్టి చి-క్కని తోలు చిదుప
"ఇక చాలునని నక్క - ఎలుగెత్తి అఱచి
చకచక పొమ్ము కే-సర మదో" అనియె.
అది పోవ నొక నక్క - అటు వచ్చె నంత
ఇది తినుచుండ న-య్యది కలబడియె.
అపు డనుకొనె నక్క - అవు నిప్డు పోరు,
కపటమ్ము పెడవారి-కడ చూపవలయు
సరిసమాన మ్మిది - సమరమ్ము సేసి
పరిమార్చి తినవలె - పంద నే కాను.
అని యుద్ధమొనరించి - అద్దాని జంపి
తన ఏన్గు నొక నెల - తనివార దినియె.

కోతి:

కాన నీవేగి మ-కరమును ద్రుంచి
ఏ నాటివలె యిల్లు - నేలు కోవయ్య

*　　*　　*

అది మంచి మాటని - ఆ మకరమ్ము
పిదప యింటికి పోయి - పెద్దగా పోరి
తన యింటి నాక్రమిం-చిన దాని జంపి
తన యింట హాయిగా - తనరారుచుండె.
అని విష్ణుశర్మ చె-ప్పెను దీనినెల్ల
వినుచున్న రాచవా-రును నీతి గనిరి.

★ లబ్ధప్రణాశం సమాప్తం ★





"చిల్లర ఏదిరా?"
"మంచి కాఫీగా చూసి తెమ్మంటిరిగా? మూడు చోట్ల తాగి చూసి ఇది తెచ్చాను."



"నేను చిన్నతనంలో పళ్లు తెల్లగా తోముకునేదాన్ని!"
"అందుకనే నీ పళ్లు ఊడిపోయాయి, అమ్మమ్మా!"



"నేను గుర్రం ఎక్కి ఊగుతున్నాను. నువ్వు గాడిద ఎక్కి ఊగు, నాన్నా!"



"కాపీరాయటం పూర్తయిందా? తప్పులు చూద్దామంటే కళ్లజోడు కనిపించదే!"

# భార్య-బానిస



పట్టు వదలని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనుష్యులు చంచల స్వభావులు. వారిలో ఒకప్పుడు ఉదారభావాలూ, ఉన్నతాశయాలూ ఏర్పడినప్పటికీ అవి వారి హృదయాలలో శాశ్వతంగా ఉండవు. ఆకాశం ఎత్తు లేచిన సముద్రతరంగం విరిగిపడిపోయినట్టుగా వారి ఆశయాలూ ఆదర్శాలూ వాటంతట అవే భగ్నమైపోతాయి. దీనికి ఉదాహరణగా జిహ్వాలుడు అనే యువకుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

పూర్వం భరుకచ్ఛపనగరంలో జిహ్వాలుడనే వైశ్యయువకుడుండేవాడు. అతను ధనికుడూ, అందమైన యువకుడూనూ. తన సాటి యువకులు అందగత్తెలను

## బేతాళ కథలు



భార్యల కోసం అన్వేషించే సమయంలో అతను నిత్యసౌఖ్యాలనుకూడా పాటించక అహోరాత్రాలు తన వ్యాపారంలోనే నిమగ్నుడై, త్వరలోనే వర్తక వాణిజ్యాలలో సాటిలేని సమర్థత సంపాదించుకున్నాడు. ఆ నగరపు వర్తకులలో అతనికన్న రెట్టింపు వయసువాళ్లుకూడా అతని సలహా, సహాయాలపై ఆధారపడ నారంభించారు. అతని ఖ్యాతి నగరమంతా పాకింది.

జిహ్వాలుడికి తమ కుమార్తెల నిచ్చి పెళ్లి చేయాలని ఎందరో కోటీశ్వరులూ, గొప్ప వంశాలకు చెందినవాళ్లూ ప్రయత్నించారు. అందానికి ప్రసిద్ధి కెక్కిన ఎందరో కన్యలు అతన్ని పెళ్లాడాలని ఉవ్విళ్లూరారు. కాని జిహ్వాలుడు పెళ్లిమాట తలపెట్టలేదు. "నా కింకా పాతికేళ్లు నిండలేదు. యవనులతో వర్తకం ఏర్పాటు చేసుకునే ప్రయత్నంలో ఉన్నాను. ఆ ఏర్పాట్లు పూర్తి కాగానే వివాహం సంగతి ఆలోచిస్తాను," అని జిహ్వాలుడు తన బంధు మిత్రులతో అంటూ వచ్చాడు.

అతను ఒక నౌకను యవనదేశం తీసుకు పోవటానికి అయత్తం చేయించాడు. అందులో విలువగల వస్తుసామగ్రి ఎక్కించారు. మంచిముహూర్తం చూసి



జిహ్వాలుడు తన పరివారంతోసహా నౌకలో ఎక్కి యవనదేశానికి ప్రయాణమైనాడు. జిహ్వాలుడి నావికులు ఆ దేశానికి ప్రయాణం చెయ్యటం ఇదే మొదలు.

కొద్దివారాలు గడిచాయి. నౌకలో మంచి నీరూ, ఆహారపదార్థాలూ అయిపోయాయి. వాటికోసమని నౌకను ఒక తీరానికి చేర్చారు. జిహ్వాలుడూ అతని పరివారమూ ఒడ్డుకు దిగి జనసంచారాలను వెతుక్కుంటూ పోసాగారు. కొంతదూరం వెళ్లేసరికి వారికి కొండలూ, అడవులూ గల ప్రాంతం తగిలింది. ఆ పర్వతారణ్యాలలో అనాగరికులైన కొండజాతి మనుషులుంటున్నారు.

వారు తమ ప్రాంతంలోకి ఇతరులను అడుగు పెట్టనివ్వరు, అడుగు పెట్టినవారిని ప్రాణాలతో బయటికి పోనివ్వరు.

జిహ్వలుడి ముఠా అరణ్యంలోకి కొద్ది దూరం వెళ్లగానే మాయాయుద్ధంలోలాగా వారిపై బాణాలవర్షం కురిసింది. ఆ దెబ్బకే చాలామంది చచ్చారు. మిగిలినవారు వెనక్కు తిరిగి పారిపోతూ ఆటవికుల ఈటెలకు బలి అయారు. జిహ్వలుడు సమీపంలో ఉన్న గుట్టమీదికి పరిగెత్తి ఎలాగో ఆటవికుల బాణాలకూ, ఈటెలకూ బలి కాకుండా తప్పించుకున్నాడు. అతని పరివారంలో ఇద్దరుమాత్రమే చిన్న గాయాలతో నౌకను చేరుకోగలిగారు. ఇంకా ఎవరైనా వస్తారేమో నని నావికులు ఆ రోజల్లా చూసి, అందరూ చనిపోయినట్టు రూఢి చేసుకుని, నౌకను భరుకచ్ఛపానికి తీసుకుపోయారు.

జిహ్వలుడు తత్సమయానికి ప్రాణాలు దక్కించుకున్నాడే గాని అతను ఆ కొండ మీద దిక్కులేని చావు చావటం తప్పనిసరిగా కనిపించింది. అతను ఒక కొండగుహలో తల దాచుకున్నాడు. ఆ చుట్టుపక్కల ఎక్కడా తిండిగాని, నీరుగాని ఉన్నట్టు అతనికి కనపడలేదు. వాటిని వెతుక్కుంటూ దూరం పోతే ఆటవికులు చంపేస్తారని అతనికి భయం. అతను అలసటతోనూ, ఆకలి





తోనూ శోషిల్లి స్పృహతప్పి పడిపోయాడు. అతనికి మళ్లీ స్మృతి తెలిసేసరికి అతని సమీపంలో ఒక ఆటవిక స్త్రీ నిలబడి ఉన్నది. ఆమెకు పదహారు, పదిహేడేళ్లుండవచ్చు. ఆటవిక స్త్రీ లందరిలాగే ఆమె మెడనిండా గవ్వలపేర్లూ, పూసలచేర్లూ వేసుకున్నది. చేతులకు దంతపుగాజులు తొడుక్కున్నది.

ఆమెను చూడగానే ముందు జిహ్వాలుడు భయపడ్డాడు. కాని ఆమె తనను చూసి చిరునవ్వు నవ్వేసరికి ఆ భయం కాస్తా పోయింది. తరవాత అతనికి ఆమె అసామాన్య సౌందర్యవతి అన్నది తెలిసివచ్చింది. అంత అనాగరికమైన ఆభరణాలు ధరించి నప్పటికీ ఆమెలో ఉన్న అందం ఏ నాగరిక స్త్రీలోనూ తాను చూడలేదని జిహ్వాలుడు అనుకున్నాడు.

ఆ పిల్లకూడా జిహ్వాలుణ్ణి చూసి అతను చాలా అందగాడని గ్రహించింది. ఆమెకు అతనిపై ప్రేమ పుట్టుకొచ్చింది. తన జాతి వారు అతన్ని చూస్తే చంపేస్తారని ఆమెకు తెలుసు. అతను తిండికోసమూ నీటికోసమూ ఆ ప్రాంతంలో తిరిగితే అతనికి క్షేమంకాదు. అందుచేత ఆమె అతన్ని సంజ్ఞలతో తన వెంట తీసుకుపోయి ఒక కొండకోన చూపింది. అది నిర్జనమైన ప్రాంతం. అక్కడ జిహ్వాలుడు స్నానం చెయ్యటానికీ, తాగ





టానికి చక్కని నీరున్నది; విశ్రమించటానికి చెట్లనీడ లున్నాయి. అతన్ని ఆ కోనలో ఉండమని ఆ పిల్ల వెళ్ళిపోయి కొంతసేపటికి అతనికి భోజనం తెచ్చింది. చీకటి పడిన దాకా ఆమె అతనివెంట ఉండి అతనికి ఎన్నో సువాసన గల అడవిపూలు మాలలు కట్టి ఇచ్చింది, అందమైన పక్షులను చూపింది. ఆ రాత్రికి అతను పడుకునేటందుకు మంచి చోటు చూపి, మళ్ళీ వస్తానని సంజ్ఞచేసి వెళ్ళిపోయింది.

వారిద్దరిదీ ఒక భాష కాదు, ఒక జాతి కాదు, ఒక సంస్కారం కాదు. అయినా జిహ్వాలుడు ఆమెను గాఢంగా ప్రేమించాడు.



ఆమె తనవెంట ఉన్నంతసేపూ అతను తన కష్టాలన్నిటినీ పూర్తిగా మరిచాడు. ఆమె వెళ్ళిపోగానే అతనికి అన్ని కష్టాలూ రెట్టింపు బరువుతో వచ్చి తనపైన పడ్డట్టయింది. ఆమె మళ్ళీ తనకు కనబడదేమోనన్న బెంగతో అతను ఆ రాత్రి కన్ను మూయలేదు. మర్నాడుదయం ఆమె ముఖం కనిపించగానే అతని దిగులంతా మంచు విచ్చినట్టు ఒక్కసారి విచ్చిపోయి వర్ణనాతీతమైన ఆనందం కలిగింది.

జిహ్వాలుడు ఆ పిల్ల రక్షణ పోషణలతో ఆ కొండలలో మూడు మాసాలు గడిపాడు. ప్రకృతి సౌందర్యాన్ని తిలకించటంలో ఉండే ఆనందమూ, రుచికరమైన ఆహారం తినటంలో ఉండే ఆనందమూ, చల్లని కోనేటి జలంలో ఈదులాడి, కొండమీది స్వచ్ఛమైన గాలి పీల్చటంలో ఉండే ఆనందమూ అతను తన జీవితంలో మొదటిసారి అనుభవించాడు. ఎంత నాగరికత ఉండీ, ఎంత డబ్బుండీ కూడా అతను ఈ సుఖాలు ఎరగడు.

అదీగాక జిహ్వాలుడు ఇంకొక ప్రాణిని ప్రేమించటంకూడా ఇదే మొదటిసారి. అది వరకెన్నడూ అతను తన కష్టసుఖాలను ఇంకొకరితో పంచుకోలేదు. ఆ అవకాశం ఈ ఆటవికుల పిల్లద్వారా దొరికింది. తన





వారందరికీ దూరమై, చేత చిల్లిగవ్వకూడా లేక, ప్రాణాపాయస్థితిలో ఉండికూడా ఆ పిల్ల ధర్మమా అంటూ స్వర్గసుఖాలన్నీ అనుభవిస్తున్నా ననుకున్నాడు.

ఈ మూడు నెలల కాలంలో వారు ఒకరి భాష ఒకరు నేర్చుకున్నారు. ఒకనాడు జిహ్వాలుడు తన స్నేహితురాలితో, "నేనిక్కడ ఇలా ఎంత కాలం బతకను. నాకు ఇళ్లూ వాకిళ్లూ ఉన్నాయి. కాని నువ్వు లేకపోతే నాకవి ఏవీ అక్కర్లేదు. నా వెంట వచ్చేసి నన్ను పెళ్లాడు. నీకు మహారాణిలాగా జరిగే టట్టు చేస్తాను!" అన్నాడు.

ఆమె ఇందుకు సమ్మతించింది. ఒకరోజు చీకటి పడగానే ఇద్దరూ ఆ ఆటవికుల ప్రాంతం విడిచిపెట్టి సముద్ర తీరానికి వచ్చారు. అదృష్టవశాత్తూ వారికొక తీర నౌక దొరికింది. జిహ్వాలుడు తన కొత్త భార్యతోసహా అందులో ఎక్కి కాలక్రమాన భరుకచ్ఛపాన్ని చేరుకున్నాడు.

భరుకచ్ఛపనగరపు రేవు అంత దూరాన కనపడగానే జిహ్వాలుడిలో ఒక వింతమార్పు వచ్చేసింది. అతను నిద్ర మేలుకున్న వాడిలాగా అయాడు. అతని మనసులో అదివరకున్న ఆలోచనలన్నీ మాయమై పోయి, మామూలు వర్తకుడైపోయాడు.



మూడు నెలలు వ్యాపారం మానటంవల్ల తన కెంత నష్టం వచ్చిందో అంచనా వేసు కున్నాడు. సముద్రాలమీద వెళ్లి అతను సరుకు వెంట తీసుకురాకుండా ఎన్నడూ తిరిగి రాలేదు. ఈసారి అతను వెంట తెచ్చిన దేమిటి? ఒక అనాగరికపు ఆటవికుల పిల్ల! ఆమెను బానిసగా అమ్మితే మంచి డబ్బు రావచ్చుననీ, తనకు కలిగిన నష్టం కొంత పూడవచ్చుననీ అతనికి తట్టింది. ఆమెవల్ల అతనికి అంతకన్న మరో ఉపయోగం కనిపించలేదు.

రేవులోకి అడుగు పెడుతూనే జిహ్వాలుడు ఆ పిల్లను వర్తకులకు అమ్మజూపాడు.

ఈ సంగతి గ్రహించి ఆమె భోరునఏడుస్తూ, "నన్ను అమ్మెయ్యకండి. నేను గర్భవతినిగా కూడా ఉన్నాను!" అన్నది.

"ఈ సంగతి చెప్పావు కావేం?" అంటూ జిహ్వాలు డామెను ఆమె గర్భంలో ఉన్న బిడ్డతోసహా దాదాపు రెట్టింపు ధరకు బానిసగా అమ్మేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, జిహ్వాలుడు ఇలాటి పని ఎందుకు చేశాడు? అతనికి ఆ పిల్ల ప్రాణభిక్ష పెట్టి, ప్రేమించి ఉపకారమే చేసింది గాని అపకారం చెయ్యలేదే! ఆమెను అతను ప్రేమించినమాట అబద్ధమా? అతను ఆమెను అమ్మే దురుద్దేశంతోనే వెంట తెచ్చాడా? లేక ప్రేమ అనేది వట్టి మోసమా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

"ఆ దేశంకాని దేశంలో జిహ్వాలుడా పిల్లను నిష్కల్మషంగానే ప్రేమించాడు. అతను స్వదేశానికి తిరిగి రాక యావజ్జీవం అక్కడే ఉండిపోయినట్టయితే బతికున్నంత కాలమూ ఆమెను ప్రాణంకన్న ఎక్కువగా ప్రేమించేవాడే. ప్రేమ మోసం ఎంత మాత్రమూ కాదు. అది వ్యక్తులను బాగు చేస్తుంది గాని పాడుచెయ్యదు. అయితే స్వార్థంతో కూడుకున్న నాగరికతలో ప్రేమ, నీరు లేని మొక్కలాగా వాడి నశించి పోతుంది. జిహ్వాలుడు ప్రేమను దక్కించుకో దలిచినట్టయితే తన స్వార్థపూరిత జీవనాన్ని వదులుకుని అడవిలో ఉండవలిసింది. రెండూ కావాలని కోరటమే అతని తప్పు. అందుచేతనే ఆమెను రాణీని చేస్తానని మాట ఇచ్చినవాడు చివరకు బానిసను చేసేశాడు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






# 3

కనానా చిన్నవాడైనప్పటికీ రషీద్ కళ్లలో బాగానే దుమ్ము చల్లాడు. తెల్లఒంటె తయీఫ్‌కు వెళ్లిందని అతను నమ్ముతాడు. తయీఫ్‌నుంచి వస్తూ కనానాకు ఎదురుపడిన బిడారు మనుషులు రషీద్ మనుషులను చేరుకున్నప్పుడు తాము దారిలో రెండు ఒంటెలను చూశామని చెబుతారు. పోతే తన అన్న మరో పది రోజులకు తనవారిని చేరుకుంటాడు.

కాని కనానా ఇప్పుడు ఒంటరిగా తన రెండో పరీక్షను ఎదుర్కోవాలి. ఇది మామూలు పరీక్ష కాదు. పర్షియా నుంచి మక్కాకు వెళ్లే రహదారి వానాకాలంలో అయితే అంత దుర్భరమైనది కాదు. అనేక చోట్ల నీరూ, ఒంటెలకు గడ్డీ దొరుకుతుంది. దారిన ప్రయాణించేవాళ్లు కూడా ఎక్కువ ఉంటారు. కాని ఈ రోజులలో ఈ దారి నిర్జనంగా ఉంటుంది. ఎక్కడా నీరు దొరకదు, బావులన్నీ వట్టిపోయి ఉంటాయి. ఎక్కడా గరికఅయినా కనబడదు. అలాటి దారి పట్టుకున్నాడు కనానా. అతను మామూలు మజిలీలలో ఆగలేదు. నల్ల ఒంటెలో త్రాణ ఉన్నంతదాకా నడిపి ముందుకు సాగాడు.

పన్నెండు రోజులు గడిచాయి. కనానా దాహంతో యమబాధ పడుతున్నాడు. అతని కళ్లకు అనేక భ్రమలు కనిపిస్తున్నాయి, లేని నీరూ, మైదానాలూ, నగరాలూ చూస్తున్నాడు. అయితే అవి భ్రమలని అతనికి తెలుసును.

ఖలీఫాగారి నల్లఒంటె కూడా అలాటి స్థితిలోనే ఉన్నది. దాన్ని ఇప్పుడు ఎవరూ ఆశించరు. అది నడిచేటప్పుడు తల నేలకు వాల్చి నడుస్తున్నది. అది ఏక్షణానఅయినా పడిపోయేలాగున్నది. అది దూరాన ఒక

జి. కేశవరావు



బావిని చూసినట్టుంది; ఎలాగో సత్తువ తెచ్చుకుని నీటి ఆశతో బావిదాకా వచ్చింది. బావిలో ఒక్క చుక్క నీరు లేదు, బయట ఉన్న ఇసకే బావిలోనూ ఉన్నది. ఒంటె స్పృహతప్పి పడిపోయింది.

కనానా దానిమీదినుంచి దిగాడు. అతనికి నిద్ర ముంచుకువస్తున్నది. అది నిద్రకాదు, శోష. తాను పడుకుని కళ్లు మూస్తే మళ్లీ లేవడు. ఆ సంగతి అతనికి తెలుసు. తన దగ్గిర మిగిలిన ధాన్యం ఒంటె ముట్టెకు అందుబాటులో పెట్టి, తూలుతూ అతను ముందుకుసాగాడు. అతని మనసులో బస్రా అట్టే దూరం ఉండదన్న ఆశ ఉన్నది, దానితోబాటు తాను త్వరలోనే దారిలో పడి పోతానన్న భయమూ ఉన్నది.

సూర్యుడు నడినెత్తిమీదినుంచి వాలి అస్తమించాడు. చీకటి పడింది. చీకటిలో కనానాకు దూరాన ఒక చిన్నదీపం కన బడింది. అతనికి ప్రాణంలేచివచ్చినట్టయింది.

ఆకస్మికంగా అతని ఎదట నీడలు కని పించాయి. అవి గుడారాలు. ఖాలిద్‌సైన్యం అక్కడ విడిసిఉన్నది. ఎవరో సైనికుడు అతన్ని ప్రశ్నించాడు. "నన్ను త్వరగా ఖాలిద్ గుడారానికి తీసుకుపో! ఖలీఫావద్ద నుంచి జాబు తెస్తున్నాను," అన్నాడు కనానా. మరుక్షణం అతనికి స్పృహ తప్పిపోయింది.





అతను మళ్లీ ఖాలిద్ గుడారంలో కళ్లు తెరిచి, సమీపంలో ఉన్న సైనికులతో, "ఒక రాత్రి ప్రయాణం దూరంలో నీరులేని బావి వద్ద నా నల్లఒంటె పడిపోయింది. దానికి నీరు తీసుకుపోండి. అది మక్కానుంచి బస్రాకు పదమూడు రోజులలో ఖలీఫా జాబు తీసుకొచ్చింది," అన్నాడు.

ఖాలిద్ ఖలీఫా జాబు చదువుకున్నాడు. అతని సైనికులు ఖలీఫా ఒంటెను రక్షించారు.

* * *

మరికొన్ని రోజులకల్లా ఒక బ్రహ్మాండమైన సేన సిరియాకేసి బయలుదేరింది. అది ఖాలిద్ సేన. అందులో అనేక అరబ్బీ దండులు సకుటుంబంగా వచ్చి చేరాయి. సేన వెనక వారి కుటుంబాలుకూడా ఉన్నాయి. ఖాలిద్ చుట్టూ అంగరక్షకులు ఈ సేనకు ముందుండి నడిచారు. వారి కన్న ముందుగా కొందరు సైనికులున్నారు. వారి మధ్య ఒక డోలీలో కనానా ఉన్నాడు. అతనికి ఎండ తగలకుండా గొంగళి ఒకటి అమర్చారు. అతని వెనకనే నల్లఒంటె నడుస్తున్నది. బయలుదేరేనాటికి అది బక్క చిక్కి ఉన్నదిగాని రోజులు గడిచినకొద్దీ కోలుకుంటున్నది. అది ఖలీఫా ఒంటె. దానిపైన బరువులేమీ లేవుగాని, ఎండ తగలకుండా కంబళ్లు కప్పి ఉన్నాయి.







నాలుగు రోజులు డోలీలో ప్రయాణం చేసినాక కనానా నల్లఒంటెమీద సవారీ చేసే స్థితికి వచ్చాడు. ఖాలిద్ అతనికి ఖరీదైన దుస్తులూ, ఒక కత్తీ, ఒక ఈటె ఇప్పించాడు. కాని కనానా వాటిని నిరాకరిస్తూ, "నేను ఎన్నడూ ఈటె పట్టిన పాపాన పోలేదు, నాకీ గొర్రెలకాపరి తోలుచొక్కా చాలు," అన్నాడు. అతనికి సైన్యానికి వెనకగా వచ్చే స్త్రీజనంతో కలిసి ప్రయాణం చెయ్యాలనే ఉన్నది గాని, ఈ సైన్యం అతనికి అగ్రస్థానం ఇచ్చి మహా యోధుడి మర్యాదలు జరుపుతున్నది. ఖాలిద్ ముందు జోహారు చేసే ప్రతి సైనికుడూ కనానా ముందుకూడా జోహారు చేస్తున్నాడు. అతనికి మళ్లీ పారిపోయే ఆలోచన కలిగింది. బేనీసాద్‌ముఠా ఎక్కడ ఉండేదీ తనకు తెలుసు; ఈ సైన్యం ఆ ప్రదేశానికి సాధ్యమైనంత దగ్గిరిగా వచ్చినప్పుడు ఆ పని చేద్దామనుకున్నాడు.

ఒక సాయంకాలం సైన్యం ఎడారిలో విడిసింది. కనానా గుడారం ఖాలిద్ గుడారం పక్కనే వేశారు. "రేపు ఈ సైన్యం మా శిబిరం సమీపంగా పోతుంది. నేను ఎలాగైనా తప్పించుకుని పారిపోయి మా వాళ్లను చేరుకుంటాను!" అని కనానా భోజనంచేస్తూ అనుకున్నాడు.

ఆ సైన్యంలో చేరినవారందరికీ ఖాలిద్‌లో పరిపూర్ణ విశ్వాసం ఉన్నది. ఆయన ఒకప్పుడు ఒకే సమయంలో డమాస్కస్ నగరాన్ని ముట్టడించి, హిరాక్లియస్ పంపిన లక్షమంది సైనికులతో పోరుతూ, ఒక వంక ఆ సైనికులను జయించి రెండోవంక డమాస్కస్ నగరాన్ని లోబరుచుకున్నాడు. ఆ యుద్ధంలో పాల్గొన్నవారు ఈ సేనలో కొందరున్నారు. తన చుట్టూ నడిచే సైనికులు ఖాలిద్ ఘనవిజయాలను మెచ్చుకోవటం విని కనానా ఎంతగానో ఉప్పొంగిపోయాడు గాని హింసావిధానం తప్పన్న అభిప్రాయాన్ని మార్చుకోలేదు.





ఇంతలో ఖాలిద్ గుడారంనుంచి మాటలు వినిపించాయి. "మనవెంట ఉన్న ధాన్యం మూడు రోజులకుమాత్రమే సరిపోతాయి."

ఈ మాటలు వినగానే కనానా ఖాలిద్ వద్దకు పోయి, "అయ్యా, బేనీసాద్‌లు సమీపంలోనే ఉన్నారు. ఆరు వారాలక్రితం వారు పంట కోశారు. వారివద్ద కనీసం అయిదువందల ఒంటెల బరువు అదనపు ధాన్యం ఉంటుంది. తమ అనుజ్ఞ అయితే నేనిప్పుడే వెళ్లి ధాన్యం తెస్తాను," అన్నాడు.

సూర్యాస్తమయమైన గంటకల్లా ఒంటెలు సిద్ధమయాయి. ధాన్యం కొనటానికి కావలిసిన ధనాన్ని పది ఒంటెలపైన వేశారు. ధాన్యం తెచ్చే గోతాలను ఇరవై ఒంటెలపైన వేశారు. ఒక ఒంటెపైన కనానా తండ్రికి ఖాలిద్ పంపుతున్న బహుమానాలు ఉంచారు. నూరుమంది అశ్వికులనూ, ఈ ఒంటెలనూ వెంటబెట్టుకుని కనానా తనవారి వద్దకు బయలుదేరాడు.

"మనం సిరియా చేరేవరకూ సైన్యానికి కావలిసిన ధాన్యాన్ని దారిపొడుగునా సంపాదించే భారం నీపైన పెడుతున్నాను," అని ఖాలిద్ కనానాతో అన్నాడు.

కనానా తమ శిబిరాన్ని చేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది. గుడారాల బయట



ఉన్న తెల్లఒంటె కనానాను చూసి గుర్తించింది. మరుక్షణం కనానా తండ్రి బయటికి వచ్చాడు. తండ్రి కొడుకులు ఆప్యాయంగా కౌగలించుకున్నారు.

"నా పొరపాటు మన్నించరా, నాయనా! నా జన్మలో నేనెన్నడూ చూపని పరాక్రమం చూపావు! నువు పిరికివాడివని సిగ్గుపడిన వాణ్ణి, ఇప్పుడు నీ ధైర్యం చూసి సిగ్గుపడుతున్నాను!" అన్నాడు తండ్రి.

కనానా ఏదో అనబోయాడు గాని నోట మాట రాలేదు. కళ్లవెంట ఆనంద బాష్పాలు రాలుస్తూ, అతను తండ్రిమెడ గట్టిగా వాటేసుకున్నాడు. ఇరవైమంది బందిపోట్లు





వచ్చినా చలించని కనానా తన తండ్రి మాటలకు చలించాడు.

తండ్రి తెప్పిరిల్లుకుని, "ఏమర్రోయ్! ఏం నిద్రలు పోతారు? లేవండి! కనానా తిరిగి వచ్చాడు!" అని కేకలుపెట్టాడు. "కనానా వచ్చాడు!" అన్న కేకలు శిబిరమంతా మారుమోగి అందరినీ లేవగొట్టాయి. కనానా తన అన్ననూ, తెల్లఒంటెనూ ఎలా సాధించాడో వారు అదివరకే విన్నారు. అంతే కాక ఖలీఫా మనిషి ఒకడు వచ్చి కనానా తండ్రికి కానుకగా బంగారు నాణాల మూట ఇచ్చివెళ్లాడు. ఇప్పుడు కనానా ఖాలిద్‌నుంచి అంతులేని బహుమానాలు తెచ్చి, తన కింద నూరుమంది సైనికులతో స్వయంగా వచ్చాడు. బేనీసాద్‌లు ఇటువంటి గౌరవ ప్రతిష్ఠలు ఏనాడెరుగుదురు?

శిబిరమంతా దివిటీలు వెలిగించారు. కనానా గౌరవార్థం వంటలు తయారుచేశారు. అతిథుల గౌరవార్థం స్త్రీలు దేశభక్తి గీతాలు పాడారు. ఆ గీతాలు పాతవే. కాని వాటిలో ఇతర వీరుల పేరు వచ్చిన చోటనల్లా కనానా పేరుంచి స్త్రీలు పాడారు. ఈ గీతాలు వింటూంటే "ఎడారి భయంకరు" డికి ఆవేశం వచ్చి, సైన్యంలో చేరుతానని మాట ఇచ్చాడు. వెంటనే మరి రెండు వందల మంది యోధులుకూడా సైన్యంలో చేరారు.



మర్నాడు మధ్యాహ్నం కనానా, అతని వెంట వచ్చినవారూ నిద్రపోయారు. బేనీ సాద్‌లు ఈలోపుగా ధాన్యంమూటలను సిద్ధంచేశారు, తమ ఆయుధాలకు పదును పెట్టుకున్నారు.

ఖాలిద్ తనపై పెట్టిన పనిని కనానా జయప్రదంగా నెరవేర్చాడు. కాని సైన్యం నుంచి పారిపోదామనుకున్న అతని ఉద్దేశం భగ్నమయింది. ఆ సైన్యానికి అతను చేయ వలిసిన సహాయం ఇంకా ఉన్నది.

* * *

సిరియానుంచీ, అరేబియానుంచీ వచ్చిన సేనలన్నీ పాలస్తీనా సరిహద్దున శిబిరాలు వేసి నిలిచాయి. ఖాలిద్ కనానాను తన గుడారానికి పిలిపించి, "నాయనా, శత్రు సేనలు మనని సమీపిస్తున్నాయి కాని వాటినిగురించి వచ్చే వార్తలు రకరకాలుగా ఉంటున్నాయి. నీవు వెళ్లి సరిఅయిన వేగు తెస్తావా? అందుకుగాను నీకు ఏమేం కావాలి?" అని అడిగాడు.

"నాకు వేగంగా పొయ్యే గుర్రాన్నీ, తమ నడుముకు చుట్టిఉన్న కాసెనూ ఇప్పించండి," అన్నాడు కనానా.

ఖాలిద్ ఎల్లప్పుడూ తన నడుముకు ఒక నీలపురంగు గల కాసెను చుట్టుకునేవాడు. అది ఒంటెతోలుతో చేసి రంగు వేసినది.

దాన్ని ఖాలిద్ సైనికులు ఎంత దూరంనుంచి అయినా గుర్తించేవారు. అరేబియా ఎడారిలో మరెవ్వరికీ ఆ రంగుకాసె లేదు.

"నీకు నచ్చిన గుర్రం ఏది ఉంటే దాన్ని తీసుకో. కాని నా కాసెతో నీకేం పని?" అని ఖాలిద్ అడిగాడు.

"దాన్ని నా చొక్కా లోపల దాచుకుంటాను. నేను వెళ్లిపోయాక, మీ కాసె దొంగిలించి ఎవడో శత్రుపక్షానికి పారిపోయాడని చాటింపు వేయండి. ఆ కాసె తాలూకు చిన్న ముక్క తెచ్చి ఇచ్చినా బహుమానం ఇస్తామని ప్రకటించండి," అన్నాడు కనానా.

ఖాలిద్ మారుమాటాడకుండా తన నడుము చుట్టిఉన్న కాసెను విప్పి కనానాకు ఇచ్చేశాడు. కనానా దాన్ని భక్తిగా తన నుదుటితో తాకి తరవాత దాన్ని చొక్కా లోపలగా తన శరీరానికి చుట్టుకున్నాడు. అతను ఖాలిద్‌కు ప్రణామంచేసి, ఆయన ఆశీర్వాదం పొంది గుడారంనుంచి బయటికి వచ్చి, ఖాలిద్ గుర్రాలలో మంచిదాన్ని ఏరుకుని, దానిపై ఎక్కి చీకటిలోకి సవారీ అయి వెళ్లిపోయాడు.

మర్నాడు సైనిక శిబిరంలో చైతన్యం ఏమీలేదు. ఖాలిద్ ధరించే కాసెను ఎవరో ఎత్తుకుపోయారనీ, దాని తాలూకు చిన్న ముక్క తెచ్చి ఇచ్చినాసరే బహుమానం లభిస్తుందనీ సైనికులు విన్నారు. తెచ్చిన ముక్కపైన బంగారు నాణాలు పరిచి బహుమానంగా ఇచ్చేస్తారట.

ఖాలిద్ శత్రువుల రాకను నిరీక్షించుతూ చేతులు కట్టుకుని కూర్చున్నవాడిలాగా కనిపించాడు. అది అతని ఇంటా వంటాకూడా లేదని తెలిసి అతని సైనికులు ఆశ్చర్య పడ్డారు. ఆయన కాసె పోయిన చింతలో ఉన్నాడని కొందరు అపోహపడ్డారు. ఈ అపోహ మర్నాడూ, మూడో రోజూ బలపడింది. సైనికులు ఆ కాసె కోసం వెతక సాగారు. —(ముగింపు వచ్చే సంచికలో)






[ 3 ]

ఆ రోజు సిద్ధార్థుడు ఉద్యానవనంలో నిశ్చింతగా గడిపాడు. సరస్సులో జలక్రీడ లాడాడు; తనకు గల ఉత్తమ వస్త్రాభరణాలను ధరించి ఉల్లాసంగా ఉన్నాడు.

సూర్యాస్తమాన మయింది. సరిగా ఆ సమయానికే యశోధర ఒక మగబిడ్డను ప్రసవించింది. శుద్ధోదనుడు పరమానంద భరితుడయాడు. "ఇది నా కొడుకుకు మరొక నూతనానందం. వా డిక సన్యాసం గురించి ఆలోచించడు," అనుకుని ఆయన, ఈ శుభవార్త చెప్పటానికి ఉద్యానవనానికి ఒక మనిషిని పంపాడు.

తనకు కుమారుడు కలిగాడని వినగానే సిద్ధార్థుడు, "రాహులుడు పుట్టాడా?" అన్నాడు. (రాహులుడు అంటే ప్రేమించదగినవాడని అర్థం.)

అప్పటికే సిద్ధార్థుడు సన్యసించ నిశ్చయించాడు. జీవితం తెచ్చిపెట్టే రోగాలనూ, ముసలితనాన్నీ, చావునూ తప్పించుకోవాలంటే జీవితంనుంచే విముక్తి పొందాలి; అందుకు సన్యసించటం ఒకటే సాధనగా అతనికి తోచింది. అయినా తన కుమారుణ్ణి ఒక్కసారి కళ్లారా చూసి ఆ ఆనందం అనుభవించి తరవాత సన్యసించుదామని అతను అనుకున్నాడు.

సిద్ధార్థుడు ఉద్యానవనం నుంచి తిరిగి వస్తూండగా కిసాగౌతమి అనే రాజకన్య అతన్ని చూసి ఆనందపారవశ్యంతో—





ప్రేమించాడనీ, యశోధరతోబాటు తనను కూడా పట్టపురాణి చేస్తాడనీ, ఆ అమాయకు రాలు అనుకున్నది!

సిద్ధార్థుడు ఇంటికి తిరిగివచ్చి అద్వితీయ మైన తన హంసతూలికాతల్పంమీద మేను వాల్చాడు. అతనికి ఆనందోల్లాసం కలిగించ టానికై స్త్రీలు అతని ఎదట నృత్యాలు చేశారు, పాటలు పాడారు, జంత్రవాద్యాలు వాయించారు. కాని సిద్ధార్థుణ్ణి ఇవేవీ ఆకర్షించలేదు. అతను కళ్లు మూసుకుని నిద్రపోయాడు.

యువరాజు నిద్రపోవటం గమనించి, అతన్ని చుట్టిఉన్న స్త్రీజనం ఆటలూ పాటలూ చాలించి, తాము వాయించిన వాద్యాలపై తలలు ఆనించి ఎక్కడి వారక్కడ నిద్రపోయారు.

"నిబ్బుతా నూన సామాతా, నిబ్బుతా నూన సోపితా నిబ్బుతా నూన సానారీ, యస్సయన్ ఈ దిసోపతి" అని పొగడింది. ఆ సమయంలో సిద్ధార్థుణ్ణి చూసి అతని తల్లీ, తండ్రీ, భార్యా ఎంతైనా ఆనందిస్తారని ఆమె భావం. నిబ్బుతి అనే మాటకు సుఖం, లేక క్షేమం (నిర్వృతి) అని ఒక అర్థం; ముగింపు, తిరుగుముఖం కావటం (నివృత్తి) అని మరొక అర్థం.

కిసాగౌతమి చెప్పిన మాటలలో సిద్ధార్థు డికి వైరాగ్యమే ధ్వనించింది. అతను ఇందుకు సంతోషించి తన మెడలోని రత్న హారాన్ని, లక్ష ఖరీదు చేసేదాన్ని, ఆమెకు బహూకరించాడు. సిద్ధార్థుడు తనను

కొంతసేపు నిద్రపోయి సిద్ధార్థుడు మేలు కున్నాడు. అతను తన చుట్టూ కలయ జూశాడు. తాను నిద్ర పోయేముందు దేవ కన్యలలాగా కనిపించిన స్త్రీలు ఇప్పుడు నిద్రలో రకరకాల భంగిమలలో పడుకుని వికారంగా కనిపించారు. నృత్యాలు చేసే టప్పుడూ, అభినయించేటప్పుడూ, పాడే టప్పుడూ వారిలో కనిపించిన సౌంధర్యాన్ని నిద్రాదేవత హరించేసింది.





సిద్ధార్థుడికి తన నిశ్చయం జ్ఞాపకం వచ్చింది. అతను ఉలికిపాటుతో లేచి కూచున్నాడు. అవును, ఈ రాత్రే తాను ఈ ఇహసుఖాలన్నిటికీ వీడ్కోలు చెప్పి సన్యాసదీక్ష పుచ్చుకోవాలి!

ఈ ఆలోచన అతని మనసులో పెరుగుతున్న సమయంలో అతనితో ఎవరో ఇలా అన్నట్టయింది :

"వెర్రివాడా, ఎందుకు సన్యసిస్తావు? ఇంకా ఏడు రోజులలో నీవు ఈ ప్రపంచంలో గల రెండువేల దీవులకూ చక్రవర్తివి కాబోతున్నావు. దశదిశలా నీ అధికారం అమలు జరుగుతుంది. చతురంగ బలాలతో కూడిన అంతులేని సేన నీ చెప్పుచేతలలో ఉంటుంది. అందుచేత విచారం మాని నిశ్చింతగా ఉండు; మనసును ఆనందంతో నింపుకో!"

అయితే ఈ మాటలు సిద్ధార్థుడి కలతను శాంతింపచేయటానికి బదులు రెట్టింపు చేశాయి. ఏడు రోజులకు కాదుగదా, అప్పుడే అతనికి ప్రపంచ సామ్రాజ్యం లభించినా అతను దానిని తిరస్కరించి ఉండేవాడే.

సిద్ధార్థుడు ద్వారంవద్దకు వెళ్లి, "మెట్ల వద్ద కాపలా కాసేది ఎవరు?" అని అడిగాడు. ఆ కేకకు చెన్నుడు ముందుకు వచ్చి, "నేనే ప్రభూ!" అన్నాడు.



"నువేనా? నా గుర్రానికి జీను వేసి సిద్ధంచెయ్యి," అన్నాడు సిద్ధార్థుడు. చెన్నుడు కంటకమనే గుర్రాన్ని సవారీకి అయత్తం చేయసాగాడు.

ఈలోపుగా సిద్ధార్థుడు తన కుమారుణ్ణి చూద్దామనే ఉద్దేశంతో యశోధర ఉండే గదికి వెళ్లాడు. అతను ఆ గది తలుపు తెరవగానే మంచంపై పడుకుని ఉన్న యశోధర కనిపించింది. ఆమె మంచం చుట్టూ పువ్వులు అమర్చిఉన్నాయి. యశోధర గాఢనిద్రలో ఉన్నది. నిద్రలో ఆమె తన బిడ్డను ఒక చేతితో చుట్టి రొమ్ముకు అనించుకుని ఉన్నది.



యశోధర చేతిని కదిలించకుండా తన కొడుకును ఎత్తుకోవటం సాధ్యం కాదని సిద్ధార్థుడు గ్రహించాడు. చెయ్యి కదిలిస్తే యశోధర తప్పక మేలుకుంటుంది, మేలుకుని తనను పలకరించి మాట్లాడుతుంది. ఆమెతో కాస్సేపు మాట్లాడినాక, సన్యసించాలన్న తన ఉద్దేశం సన్నగిల్లవచ్చు. సిద్ధార్థుడు వాకిలిమండిగాన్ని చేతితో పట్టుకుని గడప మీదనే ఆగిపోయాడు.

"నేను రాహులుణ్ణి తరవాత చూస్తాను. ప్రాణులు జన్మవిమోచన పొందే మార్గం అన్వేషించటానికి వెళ్లే నేను ఈ తరుణంలో పుత్రవాత్సల్యానికిగాను నా ఆశయాన్ని పాడు చేసుకోరాదు," అనుకుంటూ సిద్ధార్థుడు వెనక్కు తిరిగాడు. అతను మెట్లు దిగి కిందికి వెళ్లి, ఇంటిముందు ఆయత్తం చేసి ఉన్న కంటకం అనే గుర్రాన్ని చూశాడు.

కంటకం స్వచ్ఛమైన తెలుపురంగు గుర్రం. దాని నిడివి పద్దెనిమిది మూరలు, దానికి తగినంత ఎత్తుకూడానూ. సిద్ధార్థుడు ఆ గుర్రాన్ని వీపుపై తట్టి ఎక్కాడు. గుర్రం ముందు పోతుంటే చెన్నుడు దాని తోక పట్టుకుని వెనకగా నడిచాడు.

సిద్ధార్థుడు నగరపు బయట ప్రాకార ద్వారాన్ని చేరుకునేసరికి సరిగా నడిరాత్రి అయింది. ఆ ద్వారపు తలుపులు చాలా





బరువైనవి, అనేకమంది కలిసి నెట్టితేగాని తెరుచుకోవు. అంతేగాక ఆ ద్వారంవద్ద శుద్ధోదనమహారాజు అంతులేని పహరా వాళ్లను కాపు ఉంచాడు. ఈ ఏర్పాట్లన్నీ సిద్ధార్థుడు పారిపోకుండా చూడటానికే. కాని తీరా సిద్ధార్థుడు వెళ్లిపోయే సమయానికి ద్వారపాలకులందరూ నిద్రపోతున్నారు, ద్వారం తెరిచిఉన్నది.

నగరం దాటి కొంతదూరం వెళ్లాక సిద్ధార్థుడు వెనుతిరిగి చూశాడు. నిండు వెన్నెలలో కపిలవస్తునగరం దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. సిద్ధార్థుడు తన ప్రయాణాన్ని సాగించి తెల్లవారేలోగా మూడు రాజ్యాల పొలిమేరలను దాటి అనోమానది వద్దకు చేరుకున్నాడు. కంటకం ఈ ప్రయాణంలో వేగంగానే పరిగెత్తింది, దాని తోక పట్టుకుని చెన్నుడుకూడా దానితో సమంగా పరిగెత్తాడు.

సిద్ధార్థుడు అనోమానది అవతలి తీరానికి వెళ్లాడు. అది తెల్లని ఇసక ఉన్న ప్రదేశం. అక్కడ అతను తన ఆభరణాలన్నీ తీసి చెన్నుడికి ఇచ్చి, "వీటినీ, గుర్రాన్నీ తీసుకుని తిరిగిపో!" అన్నాడు.

"నన్నెందుకు వెనక్కి పంపిస్తారు? మీవెంట నేనూ వస్తాను. మీతోబాటు నేనూ సన్యసించుతాను," అన్నాడు చెన్నుడు.






"నీవు నా వెంటనే ఉంటే నా వార్త శుద్ధోదనమహారాజుకూ, యశోధరాదేవికీ ఎలా తెలుస్తుందీ. అందుచేత నీవు కపిలవస్తు నగరానికి తిరిగివెళ్లి నేను సన్యసించిన సంగతి మా తండ్రిగారికీ, మా పినతల్లి ప్రజాపతికీ, నా భార్యకూ చెప్పు. సన్యసించే అవకాశం ముందు ముందు నేనే నీకిస్తానులే. నాకోసం ఎవరూ విచారపడవద్దని చెప్పు. రాహులుణ్ణి జాగ్రత్తగా పెంచమను. నేను పూర్ణ బుద్ధుడనైగాని వాణ్ణి చూడను," అన్నాడు సిద్ధార్థుడు.

ఈ మాటలు విని చెన్నుడు దుఃఖించి, గుర్రంతోసహా తిరుగుదారి పట్టాడు.

సన్యసించేవాడు కేశఖండనం చేయించుకోవాలి. తనకు ఆ పని చేసేవారెవరూ లేరు గనక, సిద్ధార్థుడు తన కేశపాశాన్ని ఎడమ చేత్తో పట్టి ఎత్తి, కత్తితో దాన్ని కోసేశాడు. అతని శిరస్సుపైన రెండంగుళాల జుట్టు మిగిలిపోయిందనీ, అది పెరగకుండా, తరగకుండా యావజ్జీవమూ అలాగే ఉండిపోయిందనీ చెబుతారు.

తరవాత సిద్ధార్థుడు కాషాయవస్త్రాలూ, దండ కమండలాలూ ధరించి సన్యాసివేషం వేసుకుని, అటుగా జనం వచ్చేలోపలనే కదిలి అనుప్రియ అనే పేరుగల మామిడి తోపులోకి వెళ్ళిపోయాడు. అతను ఈ తోపులో ఏడు రోజులపాటు నిరాహారదీక్షలో ఉండి, ఎనిమిదో రోజు ఉదయం అక్కడినుంచి కదలి రాజగృహం అనే నగరానికి వెళ్లాడు; తూర్పుద్వారంగుండా నగరం ప్రవేశించి భిక్షకోసం ఇల్లిల్లూ తిరిగాడు.

ఈ తరుణంలోనే రాజగృహంలో ఆషాఢకేళి అనే ఉత్సవం జరిగేది. వీధులనిండా జనం ఉన్నారు. భిక్షకోసం ఇళ్లముందు నిలబడే సిద్ధార్థుడికేసి వాళ్లు అత్యాశ్చర్యంతో చూశారు. వారు అలాటి సన్యాసిని ఎన్నడూ చూడలేదు. రాజగృహానికి రాజైన బింబిసారుడి వద్దకు కొందరువెళ్లి, "మహారాజా,



మన నగరంలో ఒక వింతవ్యక్తి భిక్షమెత్తుతున్నాడు. ఆయన ఏ యక్షుడో, గంధర్వుడో, గరుడుడో, నాగుడో అయిఉండాలి గాని, మామూలు మనిషిమాత్రంకాడు!" అన్నారు.

"అతను ఎవరైనదీ తేల్చుకోవాలంటే కొందరు అతనివెంట నగరం బయటికి వెళ్లి, ఏం చేస్తాడో గమనించండి. దేవత అయితే మాయమవుతాడు, గరుడుడైతే ఎగిరి పోతాడు, నాగుడైతే భూమిలోకి దూరుతాడు, మామూలు మనిషి అయినట్టయితే తాను భిక్షమెత్తిన ఆహారాన్ని ఎక్కడైనా పెట్టుకుని తింటాడు," అని బింబిసారమహారాజు పౌరులతో అన్నాడు.

ఈలోపుగా సిద్ధార్థుడు తనకు చాలినంత భిక్ష దొరకగానే నగరం వెలపల ఉండే పాండవపర్వతం దగ్గిరికి వెళ్లి, అక్కడ ఒక చెట్టునీడను కూచుని భోజనంచేయసాగాడు. అతను ఇలాటి భోజనం ఎన్నడూ చేయ లేదు, జీవితమంతా మృష్టాన్నాలే భుజించాడు. ఇలాటి భోజనం నోటపెట్టుకోవటం మాట అటుంచి, చేత్తో తాకటానికికూడా అసహ్యమనిపించింది. కాని తపస్సులు ఇలాటి కష్టాలను ఎన్నిటినో సహించాలనే నమ్మికతో అతను ఆ అహారాన్ని దిగ మింగుతూ, "సిద్ధార్థా, నీ శరీరం బంగారు



శరీరం కాదు, ఇందులో అనేక మౌలిక పదార్థాలు కూడిఉన్నాయి. ఈ అహారం నీ శరీరంలోకి పోయి పచనమై, జీర్ణమై ఇందులోనుంచి తనకు కావలిసిన అన్నసారాన్ని స్వీకరిస్తుంది. కనక ఇదికూడా ఆహారమే!" అనుకున్నాడు.

రాజగృహ పౌరులు కొందరు సిద్ధార్థుణ్ణి వెంబడించి, అతను భోజనంచేయుటం గమనించి బింబిసార మహారాజుకు ఆ సంగతి చెప్పారు. బింబిసార మహారాజు పాండవ పర్వతంవద్దకు కదిలివచ్చి, సిద్ధార్థుడితో, "అయ్యా, మీ పేరేమిటి? మీది ఏ దేశం?" అని అడిగాడు. సిద్ధార్థుడు చెప్పాడు. వెంటనే



వారిద్దరూ చిన్ననాటి స్నేహితులన్న సంగతి బయటపడింది. "సిద్ధార్థా, ఇదేం పని? మీ వంశంలో ఎవరైనా ఎన్నడైనా ఇలా బిచ్చమెత్తుకు తిన్నారా? ఎందుకిలా చేస్తున్నావు? మా రాజ్యంలో ఎనభైవేల గ్రామాలున్నాయి. అంగ మగధదేశాలు అయిదువేల చదరపుమైళ్ల విస్తీర్ణం. నాకు ఏటా అంతులేని కప్పం వస్తుంది. నా రాజ్యంలో సగం నీకు ఇచ్చేస్తాను, హాయిగా ఏలుకో!" అన్నాడు బింబిసారుడు.

"నాకు రాజ్యాలు అవసరంలేదు. నేను కోరేది బుద్ధత్వం!" అన్నాడు సిద్ధార్థుడు.

బింబిసారుడు ఎన్ని విధాలనో చెప్పి చూశాడు, కాని ఆయన మాటలు సిద్ధార్థుడి చెవి కెక్కలేదు. చివరకు బింబిసారుడు, "నువు జ్ఞానం పొంది బుద్ధుడివయాక నీ జ్ఞానాన్ని మొట్టమొదటగా రాజగృహంలో ఉపదేశిస్తానని నాకు మాట ఇయ్యి!" అని, సిద్ధార్థుడిచేత ఒప్పించి, తిరిగివెళ్లాడు.

సిద్ధార్థుడు ఆ పర్వతంవద్దనుంచి బయలు దేరి వెళ్లేటప్పుడు అతనికి ఇద్దరు ధ్యాననిష్ఠా పరులు, అలారుడూ, ఉద్దకుడూ అనేవాళ్లు, తటస్థపడ్డారు. అతను వారితోపాటు ధ్యానం చేసి చూశాడు. కాని కేవల ధ్యానంచేత బుద్ధత్వం రాదని అతనికి తోచింది. కఠోర మైన తపస్సుచేత తప్ప తన కోరిక ఈడేర దనుకుని అతను ఉరువేల వనానికి వెళ్లాడు.

ఈ వనానికి దగ్గిరలో విస్తృతమైన ఇసక దిబ్బలున్నాయి. వీటి మూలంగానే ఆ అరణ్యానికి ఉరువేలవనమనే పేరువచ్చింది. ఆ అరణ్యంలో అనాదిగా వేలాది తాపసు లుండేవారు. వారి మనసులోకి అల్పమైన ఆలోచనలు వచ్చి తపోభంగమైనప్పుడు ఆ తాపసులు నదిలో స్నానంచేసి, నదినుంచి గుప్పెడు ఇసక తెచ్చి, ఆ ఇసకను ఒక చోట వేసేవారు. ఇలా వేసిన ఇసక రెండా మడల ఇసకమైదానంగా పరిణమించిందట.

—(ఇంకా వుంది)



# చందమామ వద్దకు ప్రయాణం

"గంటకు యాభై మైళ్ల వేగంతో నడిచే రైలు ఎక్కి ఆగకుండా ప్రయాణం చేసినట్టయితే చంద్రుణ్ణి చేరుకోవటానికి సుమారు ఏడు మాసాలు పడుతుంది," అని ఒకప్పుడు పుస్తకాలలో రాసేవారు. కాని ఇది వట్టి ఊహ. భూమికీ చంద్రుడికీ మధ్య రైలుదారి లేదు, రైళ్లు నడవటంలేదు.

అంతకన్న ముఖ్యమైన విషయమేమిటంటే, గంటకు యాభై మైళ్ల వేగంతో కదిలే వస్తువేదీ భూమిని వదిలిపెట్టిపోలేదు. తుపాకీ గుండు అనేక వందల మైళ్ల వేగంతో నడుస్తుంది కాని ఆకాశంలోకి కాల్చిన తుపాకిగుండు ఎక్కడో ఒకచోట భూమిపైనే పడుతుంది.

ఎందుచేతా ?

భూమికి ఆకర్షణశక్తి ఉన్నది. అది ప్రతి వస్తువునూ తనకేసి ఆకర్షించుకుంటుంది. ఈ ఆకర్షణనుంచి తప్పించుకుని ఏ వస్తువుగాని ఆకాశంలోకి పోవాలంటే అది ఒక సెకండుకు సుమారు అయిదుమైళ్ల వేగంతో—గంటకు 18 వేలమైళ్ల వేగాన—కదలాలి.

భూమియొక్క ఆకర్షణ శక్తినుంచి తప్పించుకోవటానికిది కనీసవేగం. కాని ఈ వేగంతో కదిలే వస్తువును భూమి తనకేసి లాక్కోలేదన్న మాటేగాని, తనచుట్టూ ప్రదక్షిణలు చేయించుకుంటూ ఆకాశంలో నిలిపిపెడుతుంది.

రష్యా అమెరికాలు ఆకాశంలోకి పంపిన "స్పుట్నిక్"లు అలాగే భూమిచుట్టూ



భూమిచుట్టూ తిరిగే స్పుట్నిక్—కృత్రిమ ఉపగ్రహం

తిరిగాయి. అయితే అవి తిరిగే పరిధిలో ఏమాత్రమైనా గాలి అంటూ ఉన్నట్టయితే దాని రాపిడివల్ల స్పుట్నిక్ వేగం కొంత కాలానికి తగ్గిపోతుంది; అప్పుడు భూమి ఆ స్పుట్నిక్‌ను తనకేసి ఆకర్షించుకోగలుగుతుంది. ఇలా కొన్ని స్పుట్నిక్‌లు పడిపోవటం జరిగింది. భూమిచుట్టూ అనేకవందల మైళ్ల మేర ఆక్రమించిఉన్న గాలిపొరను దాటి వెళ్లి అక్కడ భూమిచుట్టూ తిరిగే స్పుట్నిక్ శాశ్వతంగా అలా తిరుగుతూనే ఉంటుంది. చందమామను భూమి అలాగే తనచుట్టూ ప్రదక్షిణాలు చేయిస్తున్నది. చందమామ అనేకవందల కోట్ల ఏళ్లుగా భూమిచుట్టూ ప్రదక్షిలు చేస్తున్నది; ఇంకా ఎన్నోవందల కోట్ల సంవత్సరాలపాటు ప్రదక్షిణలు చేస్తుంది.

గంటకు 18 వేల మైళ్ల వేగంతో కదలగలవి ఈనాడు రాకెట్లు మాత్రమే. మామూలు అవ్వాయి చువ్వలు ఆకాశంలోకి ఎలా వెళతాయో రాకెట్‌కూడా అదే పద్ధతిలో ఆకాశానికి ఎగురుతుంది. అయితే అందులో మామూలు టపాకాయమందు గాక మండే ద్రావకాలను, చాలా శక్తివంతమైనవాటిని, వాడతారు.

ఇటువంటి రాకెట్‌లో, 18 వేల మైళ్ల వేగంతో కదిలినా మనం చంద్రుణ్ణి చేరుకోలేం. ఎందుచేతనంటే ఆ రాకెట్ భూమిచుట్టూ ప్రదక్షిణలు చేస్తుందిగాని భూమియొక్క ఆకర్షణను పూర్తిగా తప్పించుకుపోదు.

భూమియొక్క ఆకర్షణను పూర్తిగా తప్పించుకుపోవాలంటే రాకెట్ వేగం ఒక సెకండుకు దాదాపు 7 మైళ్లు—గంటకు 25 వేల మైళ్లు—ఉండాలి. గత జనవరి 2 తేదీన రష్యావారు ప్రయోగించిన రాకెట్ ఇంతవేగం కలది.



చంద్రుణ్ణి దాటి సూర్యుడిచుట్టూ తిరగటానికి వెళుతున్న కృత్రిమగ్రహం

అయితే ఈ వేగంతో వెళ్లే రాకెట్ సూటిగా వెళ్లి చంద్రుడిపైన వాలదు. ఇంత వేగంతో అది చంద్రుడికి వెళ్లి తగిలిందా అంటే రాకెట్ పప్పుపప్పు అయిపోతుంది. అందులో ప్రాణులేవైనా ఉంటే అవి బతికే ఆశ లేదు.

ఒకవేళ ఆ రాకెట్ చంద్రుడికి తగలకుండా పక్కగా వెళ్లేపక్షంలో చంద్రుడు దాన్ని తన కేసి ఆకర్షించుకోలేడు. చిక్కేమిటంటే భూమికి గల ఆకర్షణశక్తిలో ఆరోవంతు మాత్రమే చంద్రుడికి ఉన్నది.

నిజానికి చంద్రుడిలో ప్రాణిజాతులు లేవు కాని మాటవరసకు చంద్రుడిలో మనుషులుంటే వారు భూమికి ప్రయాణం చెయ్యటం, మనం చంద్రుడికి వెళ్లటంకంటే చాలా సులువు. ఎందుకంటే సెకండుకు ఒకటిన్నర మైళ్ల వేగంతో కదిలేవస్తువు చంద్రుడి ఆకర్షణ నుంచి సులువుగా తప్పించుకోగలదు.

ఈ కారణంచేత భూమినుంచి పూర్తిగా తప్పించుకుపోయిన రాకెట్ చంద్రుణ్ణి దాటి ఆకాశంలో ఇంకా దూరం వెళ్లి సూర్యుడి ఆకర్షణకు లోబడి, సూర్యుడి చుట్టూ గ్రహం లాగా శాశ్వతంగా ప్రదక్షిణలు చేయ నారంభిస్తుంది.

ఇటీవల రష్యనులు వేసిన రాకెట్ ఇలాగే సూర్యుడి చుట్టూ ప్రదక్షిణం ఆరంభించింది.

కృత్రిమ ఉపగ్రహంలో యంత్రాలు అమర్చిన గోళం



ఇక చంద్రుడి వద్దకు ప్రయాణం చెయ్యటానికి ఉన్న అడ్డంకి అల్లా ఏమిటంటే మనుషులతో కూడిన రాకెట్లను ఆకాశంలోకి క్షేమంగా పంపటం. అలాటి రాకెట్ గంటకు 25 వేల మైళ్ల వేగంతో భూమియొక్క ఆకర్షణను తప్పించుకుని ఆకాశంలోకి వెళ్లి నట్టయితే అందులో ఉండే మనిషి సమయానికి దాని వేగాన్ని తగ్గించి చంద్రుడి ఆకర్షణకు గురి అయేటట్టు చేసి నిరపాయంగా చంద్రుడిపై దిగగలుగుతాడు.

కాని అంతటితో చంద్రమండల ప్రయాణ సమస్య తీరిపోతుందా? తీరిపోదు. అందులో ఉండే చిక్కులు పైనెల తెలుసుకుందాం.



# ప్రకృతి వింతలు

## 9

నాకు కుమేవావాలో ఇంకొక సుగుణం కనిపించినట్టయి, వాడిమీద వుండే గౌరవ భావం హెచ్చింది.

వాడు తన ఆయుధాలు తీసుకున్నాక మేము నడక సాగించాం. మేము అలా ఒక గంటసేపు నడిచాం.

ఉదయ కాంతిలో అరణ్యం చాలా అందంగా వున్నది.

ఒక పొదలోనుంచి ఒక తాబేలు బయటికి వచ్చింది. నేను దాన్ని పట్టుకోవటానికి ప్రయత్నిస్తే దాని డిప్ప జారుడుగా వుండి పట్టటం సాధ్యంకాలేదు. పైగా దానికి బలమైన గోళ్ళుకూడా వున్నాయి. కుమేవావా నా అవస్థ చూసి విరగబడి నవ్వాడు. అది తప్పించుకుపోయే సమయంలో వాడు వచ్చి ఒక్క ఊపుతో దాన్ని వెల్లకిలా పడేశాడు. ఆ విధంగా అది మాకు చిక్కింది.

"ఈపూట ఇదే మనకు ఫలహారం," అన్నాడు వాడు.

తాబేలును నిప్పులో కాలుస్తున్నంతసేపూ కుమేవావా చుట్టూ కలయజూస్తూనే ఉన్నాడు. వాడు ఎత్తయిన చెట్టు కొమ్మలకేసి చూసి, "న్యేకుచాప్‌కు తేనె ఇష్టమేనా?" అని అడిగాడు.

"ఇష్టమే కాని ఇప్పుడెక్కడినుంచి వస్తుందీ ?" అన్నాను.

"అనాసముక్కలు తేనెతో తింటే అద్భుతమైన రుచి. మనకు అనాసపళ్లు దొరకబోతున్నాయిగద," అన్నాడు వాడు. "మీరు తాబేలును కాలుస్తూ ఉండండి. నేను వెళ్లి తేనె తెస్తాను. ఆ పెద్ద చెట్టుమీద తొర్ర కనిపిస్తున్నదా ?"

వాడు నాకు చూపించాడు గాని నేను వాడు చెప్పే తొర్రను గుర్తించలేకపోయాను.

తిబోర్ సెకెల్యో





తేనె ఉంచటానికనివాడు ఒక వెదురు బొంగు కోశాడు. రెండు కణుపులకు దిగువగా కోసేసరికి అడుగు మూసిన గొట్టం తయారయింది. ఆ గొట్టంలో ఇరవైనాలుగు ఔన్సుల తేనె పట్టుతుంది, కాని వాడి కది చాలినట్టు కనిపించలేదు; వాడు అలాటి గొట్టమే మరొకటి తయారుచేశాడు. తరవాత వాడు ఒక చెట్టుపట్టా చీల్చి దానితో రెండు గొట్టాలూ కట్టి వాటిని తన భుజంమీద ముందూ, వెనకా వేళ్లాడేటట్టు వేసుకున్నాడు. ఆపైన వాడు ఆ చెట్టు పట్టాతోనే పొడుగాటి తాళ్లు తయారుచేసుకుని బయలుదేరాడు.

వాడికి కావలిసిన చెట్టు ఒక వాగు అవతల ఉన్నది. వాడు వాగుదాకా వెళ్లి అందులోకి దిగబోయి ఆగాడు. దాని అడుగున నీటిలో మునిగి ముళ్లపొద లున్నాయి. అందుచేత వాడు వాగు ఒడ్డున ఉన్న ఒక చెట్టు ఊడ పట్టుకుని, అది తన బరువు మోస్తుందా లేదా అని బలంగా గుంజి చూచి, దాని సహాయంతో వాగు అవతలి ఒడ్డు చేరాడు.

వాడు ఎక్కవలసిన చెట్టు చాలా లావైనది. దాని బోదె నున్నగా ఉన్నది. అందుచేత వాడు తన కాలికి బందం తగిలించుకుని చెట్టు ఎక్కనారంభించాడు. ఇలా పది గజాలు ఎక్కాక నడుముచుట్టూ బందం అమర్చుకుని కాలిబందాన్ని విడిచేశాడు. తరవాత వాడు తొర్రను చేరి తేనెతుట్టెను తన కత్తితో తవ్వసాగాడు. తేనెటీగలు వాడి చుట్టూ లేచాయి. అయితే అడవితేనెటీగలు మామూలు తేనెటీగల లాగా కుట్టవు; లేకపోతే అవి ఆ రోజున వాణ్ణి చంపేసి ఉండేవే.

వాడు తొర్రలోకి చెయ్యిపెట్టి తేనెపట్టు పైకి తీసి వెదురుగొట్టాలలోకి తేనె పిండటం నాకు కనిపించింది. ఇలా చాలాసార్లు చేశాడు. వాడు మధ్యమధ్య తన చెయ్యి నాక్కుని, "చాలా మంచితేనె. ఇంత రుచి






గల తేనె ప్రపంచంలో యింకెక్కడా ఉండదు!" అన్నాడు.

రెండు గొట్టాలూ నిండగానే వాడు చెట్టు దిగి, మళ్లీ ఊడ సహాయంతోనే వాగు దాటి నాదగ్గిరికి తిరిగి వచ్చాడు. ఇద్దరమూ ఆ తేనె తాగాం. అది తియ్యతియ్యగా, పుల్ల పుల్లగా ఉండి చాలా రుచిగా ఉన్నది. కొంచెం తేనె ఆరగించినాక వాడు రెండు వెదురుగొట్టాల మూతులకూ పెద్ద ఆకులు వాసెన కట్టి బిగించాడు.

మేము తాబేలుమాంసం తినేటప్పుడు వాడు నాతో, "చెట్టుమీది నుంచి చూస్తే అనాస మడులు దగ్గిరలోనే ఉండటం కనిపించింది," అన్నాడు. మేము పది నిమిషాలలో వాడు చెప్పినచోటికి వచ్చాం. అక్కడ మూడు నాలుగడుగుల ఎత్తున ముళ్లమట్టలు గల పొదలు కనిపించాయి.

"ఇవే అనాసపళ్లు," అన్నాడు వాడు. కాని నాకెక్కడా పండు కనిపించలేదు. వాడు ఒక పొదవద్దకు వెళ్లి కత్తితో ముళ్ల మట్టలు కోసి, ఒక పండు తీసి ఎత్తి నాకేసి విసిరాడు. అది నారింజరంగులో పుచ్చకాయ ప్రమాణంలో ఉన్నది. నేను అనాస పండును చూడటం అదే మొదటిసారి. దాని నిండా కూడా ముళ్లుండటం చూసి నేను చాలా నిరుత్సాహపడ్డాను. వాడు ఒక్కొక్క పొదవద్దకే వెళ్లి ముళ్లను లక్ష్యపెట్టకుండా కత్తితో అనాసపళ్లు కోయసాగాడు. కాళ్లకు బూట్లు ఉండికూడా ముళ్లకు భయపడటం నాకే సిగ్గయి, నేనుకూడా వాడిలాగే అనాస పళ్లు కోయసాగాను. కొన్ని ముళ్లు గుచ్చుకున్నాక, వాటిని తప్పించుకునే ఉపాయం తెలిసింది.

అనాసపళ్లు పెద్ద గుట్టగా తయారయాయి. లెక్కించగా ముప్ఫైఅయిదు పళ్లున్నాయి. వీటిని ఎలా తీసుకుపోతామా అనుకున్నాను. ఈలోపుగా కుమేవావా ఒక పండు కోసి గుండ్రని చక్రాలు చేసి వాటికి తేనె పూశాడు.

వాడన్నట్టు తేనెతో కలిపి తింటే అనాస చాలా రుచిగా ఉన్నది.

వాడు రెండు కొమ్మలు కోసి వాటిని రెండు కావళ్లుగా తయారుచేసి, ఒక్కొక్క చివరా ఎనిమిదేసి అనాసపళ్లు కట్టాడు. ఇద్దరమూ చెరొక కావడీ మోస్తూ, డస్సిపోయి, చెమటలు దిగకారుతూ శిబిరం చేరాం.

నలుగురు మనుషులు నీటిలోకి దిగి పడవలో పడిన చిల్లిని మరమ్మతు చేస్తున్నారు. చిల్లిని మూయటం పూర్తిఅయింది. దానికి మైనం పెడుతున్నారు.

భోజనాలు అయాక ఒక్కొక్క ప్రయాణీకుడూ ఒక్కొక్క అనాసపండు తీసుకుని, అందులో సగం తిని మిగిలిన సగమూ ప్రయాణానికి ఉంచుకున్నాడు. అనాస ముక్కలకు తేనె రాచి తినేటప్పుడు ప్రయాణీకులు సంతోషంతో కేకలుపెట్టారు.

మరమ్మతు పూర్తిఅయింది గనక ఒడ్డున ఉన్న పడవను మళ్లీ నీటిలోకి తోశాము. సగంమంది పడవను తోస్తుంటే మిగిలిన వాళ్లు పగ్గాలు బిగలాగి పట్టి, పడవ ఒక పక్కకు ఒరగకుండా చూశారు. పడవ లోతు నీటిలోకి వెళ్లి లంగరు దించింది. నావికులు ప్రయాణీకుల సహాయంతో పడవను కడిగారు. తరవాత సామాన్లు పడవ కెక్కించారు.





కుమేవావా కోసం చందాలు పోగుచేసిన పెద్దమనిషి వాడితో, "అబ్బాయీ, నీవు చేసిన సహాయానికి మేమంతా ఎంతో రుణ పడి కృతజ్ఞులమై ఉన్నాము. నీకోసం పోగు చేసిన ఈ డబ్బు తీసుకో!" అన్నాడు.

"నాకు డబ్బుతో పనిలేదు. నాకు కావలిసిందంతా ఈ అడవిలో ఉన్నది. ఇక్కడ లేనిది నాకు నిరుపయోగం," అన్నాడు కుమేవావా.

నేను వాడితోబాటు తెప్పలో కూచుని ఉన్నాను. వాడు నా చెయ్యి గట్టిగా నొక్కాడు.

"కుమేవావా, నువు ఎప్పుడైనా పడవ ప్రయాణం చేశావా?" అని అడిగాను. వాడు లేదన్నాడు. "అయితే మావెంట రా, పడవ చూద్దువుగాని!" అన్నాను. పడవ కాప్టెను ఇందుకు అనుమతించాడు. వాడు పడవ అంతా పరీక్షగాచూసి చివరకు దిగిపోయే టప్పుడు నేను నా ఎండటోపీ వాడికిచ్చి, "కుమేవావా, నా జ్ఞాపకార్థం ఇది నీ దగ్గిర ఉంచుకో!" అన్నాను.

వాడి పెదవులు ఏదో అనబోయినట్టు కదిలాయి. కాని వాడి నోట మాట ఏమీ రాలేదు. వాడు చప్పున బాణం తీసి ఎక్కు పెట్టి అస్తమించే సూర్యుడికేసి నీటిమీదికి విసిరాడు. అది దూరంగా నీటిలో పడింది. వాడు చప్పున తన తల వెనకభాగంలో ఉన్న ఈక తీసి నా చేతికిచ్చి, "ఇది కాస్త పట్టుకుంటే, నాబాణం మునిగిపోయేలోగా తెచ్చుకుంటాను," అంటూ తన తెప్పను తెడ్డువేసి నడుపుకుంటూ వెళ్లాడు.

వాడి తెప్ప దూరాన కనబడకుండా పోయేదాకా నేను పడవమీదే నిలబడి దాని కేసి చూశాను....

ఆ ఈక ఇప్పటికీ నాదగ్గిరే ఉన్నది. కష్ట సమయంలో దాన్ని తీసి చూశానంటే నాకు ఆనాటి సంఘటనలు జ్ఞాపకం వచ్చి ధైర్యం కలుగుతుంది... —(అయిపోయింది)



# వినోదాలు

తాత (మనవడితో): ఏదన్నా చిన్న ఉద్యోగం చూసుకోరాదుట్రా? నీ ఈడున నేను 25 రూపాయల జీతంమీద ఒక దుకాణంలో గుమాస్తాగా కుదిరి. అయిదేళ్లలో ఆ దుకాణానికి యజమానినయాను.

మనవడు: ఈరోజుల్లో ఆ పప్పులేవీ ఉడకవు. ప్రతి దుకాణంలోనూ ఎకౌంటుపుస్తకా లుంటాయి.

* * *

తండ్రి (క్లాసుమేస్టరుతో): మావాడు అల్లరిచేసేవాడే ననుకోండి. కాని వాణ్ణి కొట్టితే రాటుతేలి ఎందుకూ పనికిరాకుండాపోతాడు. అందుచేత వాడేదైనా చెడ్డపని చేస్తే పక్కపిల్ల వాణ్ణి బాదండి. దాంతో మావాడు హడలిపోయి బుద్ధిగా నడుచుకుంటాడు!

* * *

అల్లుడు (మామగారితో): మీ అమ్మాయిప్రవర్తన కొంచెంకూడా బాగాలేదు. నేను బీద వాణ్ణి కావచ్చు, మీ ఆస్తి అంతా ఆవిడకు రావచ్చు; అంతమాత్రాన నలుగురి ఎదటా నన్ను గురించి తేలికగా మాట్లాడటమేనా?

మామగారు: నిజమేనోయ్. నా ఆస్తిలో దానికి దమ్మిడీకూడా రాకుండా చేసేస్తాను, రోగం కుదురుతుంది.

అల్లుడు: తొందరపడకండి. మంచిమాటలతో చెప్పిచూడండి.

* * *

ఒక వ్యాపారసంస్థలో పనిచేసే షరాబు పెద్ద మొత్తం కాజేసి దొరికిపోయాడు. అతను చాలాకాలం పనిచేసిన కారణంచేత యజమాని అతన్ని ఉద్యోగంనుంచి తొలగించి అంతటితో వదిలిపెట్టాడు. కొత్త షరాబుకోసం ప్రకటన చేశారు. ఆ ఉద్యోగానికి పాతషరాబే దరఖాస్తు పెట్టాడు.

"మళ్లీ నిన్ను వేసుకుంటామా?" అన్నాడు యజమాని.

"అయ్యా, కాస్త ఆలోచించండి. ఇప్పుడు నాకు కావలిసినవన్నీ ఏర్పాటయాయి. మంచి ఇల్లు కట్టించుకున్నాను, రేడియో కొన్నాను, కారు కొనుక్కున్నాను. నన్ను వేసుకోవటం క్షేమమా? కొత్తవాణ్ణి పెట్టుకోవటం క్షేమమా? మీరే చెప్పండి!" అన్నాడు పాత షరాబు.

* * *

"బొత్తిగా అనుభవం లేదని ఒప్పుకుంటూ అంతపెద్ద జీతం అడుగుతావేం?"

"తమరే ఆలోచించండి. అనుభవం లేనివాడికి పని మరింత కష్టంగద!"

* * *

ఒక ఆసామీ దగ్గిర ఒక కోడిపుంజు ఉన్నది. దానికి ఎప్పుడు కూయాలో తెలియదు. పక్కఇంటి పుంజు కూసినప్పుడు అది తల ఆడిస్తుంది.




ఖలీఫా హారూన్ అల్‌రషీద్ కొలువులో ఒకప్పుడు బుహ్లూల్ అనే విదూషకుడు ఉండేవాడు. అతను కేవలం విదూషకుడే గాక జ్ఞానికూడానూ.

ఒకనాడు ఖలీఫా తన విదూషకుడితో, "బుహ్లూల్, మన బాగ్దాద్‌నగరంలో ఎంత మంది మూఢులున్నారో నీకు తెలుసునా ?" అని అడిగాడు.

తెలుసు నన్నాడు విదూషకుడు.

"అలా అయితే వారందరి పేర్లూ పట్టీ తయారుచెయ్యి. అందులో ఒక్క పొరపాటు కూడా చెయ్యకూడదు, తెలిసిందా ?" అన్నాడు ఖలీఫా.

విదూషకుడు విరగబడి నవ్వి, "అంత కంటె బాగ్దాద్‌నగరంలో ఉండే జ్ఞానుల జాబితా తయారు చెయ్యటం చాలా సులువు. ఆ జాబితా తయారుచేస్తాను. అందులో లేని వారంతా మూఢులే అనుకోండి," అన్నాడు.

బుహ్లూల్ ఒకనాడు ఖలీఫా లేనిసమయం చూసి ఆయన సింహాసనంపై కూర్చున్నాడు. ఈ సాహసం చేసినందుకు దర్బారు ఉద్యోగులు అతన్ని కర్రలతో కొట్టించారు.

ఖలీఫా వచ్చేసరికి విదూషకుడు ఏడుస్తూ కనిపించాడు. ఖలీఫా జరిగిన సంగతి అంతా విని తన విదూషకుణ్ణి ఓదార్చబోయాడు.

"ఏలినవారు పొరబడుతున్నారు. నేను నాకు తగిలిన దెబ్బలను గురించి ఏడవటం లేదు. కాస్సేపు సింహాసనంమీద కూర్చున్నందుకే నాకిన్ని దెబ్బలు తగిలితే, ఏళ్ల తరబడి కూచునే తమకు ఆ లోకంలో ఎన్ని దెబ్బలు తగులుతాయోగదా అని విచారిస్తున్నాను !" అన్నాడు విదూషకుడు.

బుహ్లూల్‌కు పెళ్లి అంటే పడేదికాదు. ఈ సంగతి తెలిసి ఖలీఫాకు కోపం వచ్చింది. ఆయన ఒకనాడు తన బానిసలలో ఒకతెను, అందమైనదాన్ని ఏరి, తన విదూషకుడి

హెచ్. రామనాథం

కిచ్చి బలాత్కారంగా పెళ్లిచేశాడు. ఆ రాత్రి పెళ్లికూతురు వచ్చి తన పక్కన కూచోగానే విదూషకుడు చివాల్న లేచి, "ఓయమ్మో! ఓయి బాబో!" అని కేకలు వేస్తూ రాజ మందిరం అంతటా పరిగెత్తాడు.

ఖలీఫా అతన్ని పిలిపించి, "దుర్మార్గుడా, నీకు చక్కని పిల్లనిచ్చి పెళ్లిచేస్తే దాన్ని వదిలేసి చావుకేకలు పెడుతూ పారి పోతావా?" అని అడిగాడు.

దానికి విదూషకుడు, "ఏలినవారు క్షమించాలి! నా భార్య అందమైనదే, సందేహం లేదు. కాని ఆమె నాదగ్గిరికి వచ్చి కూచోగానే ఆమె గుండెలోనుంచి గొంతుకలు వినిపించాయి. 'నాకు మంచి బట్టలు కావాలి, నాకు మంచి నగలు కావాలి' అని ఆ గొంతుకలు అనటం విని నేను బెదిరి పారిపోయాను!" అన్నాడు.

అయితే బుహ్లూల్ ఈ మాట లన్నది ఖలీఫానుంచి డబ్బు రాబట్టటానికి కాదు. ఎందుకంటే ఒకసారి ఖలీఫా తన విదూష కుడికి వెయ్యి బంగారు దీనారాలు బహు మతి ఇచ్చాడు. కాని విదూషకుడు దానిని నిరాకరించాడు. మరి కొంతకాలానికి ఖలీఫా మరోసారి వెయ్యి దీనారాలు ఇవ్వబోతే విదూషకుడు అప్పుడుకూడా అవి తీసుకోవ టానికి నిరాకరించాడు.





"నేను సంతోషించి బహుమతీ ఇస్తే తీసుకోక నిరాకరిస్తావు, ఏమిటి కారణం?" అని ఖలీఫా అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా విదూషకుడు తన అరికాలు ఎత్తి ఖలీఫా మొహంముందు పెట్టాడు. ఈ దుండగం కళ్లారా చూసిన ఖలీఫా సేవకులు విదూషకుడిపై బడి చావ గొట్టబోయారు. కాని ఖలీఫా వారిని వారించి, "ఎందుకు అలా అమర్యాదగా ప్రవర్తిస్తున్నావు?" అని అడిగాడు.

"ఏలినవారు గమనించాలి. నేను తమ కేసి చేతులు చాచి తమరి బహుమానాలు స్వీకరించినట్టయితే నాకిప్పుడు తమకేసి కాళ్లు చాచే హక్కుండేది కాదు," అన్నాడు విదూషకుడు.

ఒకసారి ఖలీఫా యుద్ధంచేసి తిరిగి వస్తున్నాడు. ఖలీఫావెంట బుహ్లూల్ కూడా ఉన్నాడు. ఒక మజిలీలో అర్ధరాత్రివేళ ఖలీఫాకు అపరిమితంగా దాహమయింది. ఆయన, "నీరు, నీరు!" అని అరవటం విని విదూషకుడు లేచి వెళ్లి నీరు తెచ్చాడు.

"ఈ నీరు తాగేముందు ఏలినవారు ఒక్క ప్రశ్నకు సమాధానం చెప్పాలి. ఈ నీరు లభ్యంకానిపక్షంలో దీనికోసం ఏలిన వారు ఎంత ఇచ్చిఉండేవారు?" అన్నాడు విదూషకుడు.

"అర్ధరాజ్యం ఇచ్చేవాణ్ణి!" అంటూ ఖలీఫా నీరు తాగాడు.

"ఈ తాగిన నీరు అల్పాచమానం రూపంలో బయటికి రాక లోపలే బిగదీసుకు పోతే దాన్ని బయటికి రప్పించటానికి ఎంత ఇస్తారు?" అని విదూషకుడు అడిగాడు.

"అవసరమైతే అర్ధరాజ్యం ఇస్తాను!" అన్నాడు ఖలీఫా.

"ఇన్ని నీళ్లకూ, ఇంత అల్పాచమానానికీ సమానమైనవిలవగలరాజ్యంకోసంయుద్ధాలు దేనికి, ప్రభూ?" అన్నాడు బుహ్లూల్. ఖలీఫా సిగ్గుతో తలవంచుకున్నాడు.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పడగ విప్పవే పామా

రెండవ ఫోటో : అడుగు వేయవే భామా

పంపినవారు : బంగారు చొక్కలింగారెడ్డి,

టి. ఐ., సెంట్రల్ జైలు, విశాఖపట్నం-4.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# వార్తా చిత్రాలు

ఈ దిగువ బొమ్మలో చూపిన బంతి దంతంతో తయారుచేసినది. దీని వ్యాసం నాలుగున్నర అంగుళాలు. ఇది తయారు చేసిన శిల్పిపేరు భగత్ భీమసేన్. ఈయన ఢిల్లీ వాస్తవ్యుడు.

ఈ బంతిని తయారుచేయటంలో గల విశేషం ఏమిటంటే దీనిలోపల ఇంకా ఇరవై అరు చిన్న బంతులున్నాయి.

ఒక చైనా శిల్పి కొంతకాలం క్రితం అరు అంగుళాల వ్యాసంగల దంతపు బంతిలో 24 చిన్న బంతులు తయారు చేసిఉన్నాడు. కాని భీమసేన్ 1955 లో 25 చిన్న బంతులతో కూడిన దంతపు బంతిని, నాలుగున్నర అంగుళాల వ్యాసంగలదాన్ని తయారు చేశారు. ఇప్పుడాయనే తిరిగి 26 బంతులు గల ఈ దంతపు బంతిని తయారుచేశారు.

ఈ శిల్పి గత 22 ఏళ్లుగా ఢిల్లీలో దంతపు పని చేసేవారికి శిక్షణ ఇస్తూ ఉన్నారు.





అనాధ స్త్రీల సంక్షేమం కోసం అనేక సంస్థలు ఈనాడు పాటుపడుతున్నాయి. ప్రభుత్వంవారు నిర్వహించే సంస్థలే గాక అనేక సహకార సంస్థలుకూడా ఇందుకు గాను కృషిచేస్తున్నాయి.





(పైన) నికొబార్ దీవులలో నివసించేవారి సంపద యావత్తూ అరణ్యాలనుంచీ, కలపనుంచీ లభిస్తుంది. వీరు ఆ ముడి పదార్థాలతో తయారు చేసిన వస్తువులు దేశమంతటా ప్రసిద్ధి సంపాదిస్తున్నాయి. (కింద) కులు పర్వతాలమధ్య సమావేశమైన గ్రామపంచాయతీ.



# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలో కాయలు కోసుకుతినేందుకు వెళ్లారు. కాని, ఒక జామచెట్టుమీద వాళ్లు అంతకు ముందురోజు చూసిన కాయలు లేవు. 'టైగర్' మొరుగుతూ దారి తీసేసరికి వాళ్లు వెళ్లి ఒకచోట ఒక కుర్రాణ్ణి చూశారు. వాడు తను జామకాయలు దొంగలించ లేదని చెప్పి, నేలమీద విరిగి పడివున్న చెట్టుమండల్లో ఒక పామును చూపాడు. 'టైగర్' ఒక్క దూకున వెళ్లి పాముతల పట్టుకున్నది. అది రబ్బరుపాము. దొంగ కుర్రాడు పరిగెత్తాడు. చెట్టు మండలకింద వాడు దాచిన జామకాయలు దాసూ, వాసూలకు దొరికినై.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

మీ యింటిలో **ఉషా** కుట్టుమిషను పెట్టుకుని, మీ దుస్తులను మీరే కుట్టుకొని, డబ్బునూ కాలాన్నీ పొదుపుచేసికోండి. **ఉషా** కుట్టుమిషను ఎట్టి చిక్కులూ లేకుండా పనిచేస్తుంది. మీ ఇంటికి అవసరమైన ముఖ్యవస్తువులలో ఈ **ఉషా** కుట్టుమిషను చాలా ప్రాముఖ్యమైనది. ఉచితంగా చేసిచూపే డెమాన్‌స్ట్రేషనుకొరకు మీ సమీపంలో ఉండే వ్యాపారస్థుని కలుసుకోండి. ఇది **జె ఇంజనీరింగ్ వర్క్సు లిట్, కలకత్తా వారి** నిర్మాణము.






# ఉషా

మీ నమ్మకానికి తగిన
కుట్టుమిషను



సోల్ ఏజంట్లు :

## ఏజంట్స్ & డిస్ట్రిబ్యూటర్స్ (ప్రైవేట్) లిమిటెడ్,

కలకత్తా.

మద్రాసు ఆఫీసు:— 120, ఆర్మీనియన్ స్ట్రీట్, మద్రాసు - 1.

మద్రాసు స్టేట్ (మదరాసు నగరం, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు జిల్లాలు గాక)
కేరళం, దక్షిణ కన్నడం కూర్గ్, మొదలైన ప్రదేశాలకు, ఇంకా
ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్టణం, తూర్పు - పశ్చిమ గోదావరి జిల్లాలకు

ఆధునిక యంత్ర
పరికరములతోను
షాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

కె. వి. డి. నివాస్, (3 వ ఫ్లోరు) ముగ్‌భాట్ వీధి, బొంబాయి-4. (ఫోన్: 75526)

డి/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)

ఇప్పుడు నిమ్మ రసముతో టీ తయారుచేసి చూడండి




అన్ని కాలములకు తగినది:
పొగలు గ్రక్కుతున్న వేడి తేనీరులో
కొన్ని చుక్కల నిమ్మ రసము వేసి
(పాలు కలుపరాదు) రుచికి తగ్గ
చక్కెర వేసికొని కలిపి సేవించండి.
టీ రుచికి నిమ్మ రసము
ఉదాత్తంగా వుంటుంది.






నేను టీనే- నేను మీ స్నేహితుడుని

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

అడుగు వేయవే భామా

పంపినవారు :
బి. సి. రెడ్డి - విశాఖపట్నం

